

శ్రీ అరవిందుల

# కర్మయోగియొక్క ఆదర్శము

ఈ గ్రంథమునందు, భారతదేశ భావిభాగ్యమును రూపొందించు క్రియాత్మక శక్తులను గురించియు, భారతీయ సంస్కృతిని జీవితమును నూతనముగా సృష్టించుచున్న ఉన్నతాకాంక్షలను గురించియు, సంతోషదాయక సౌందర్యమగు భాషలో విశదీకరింపబడినది.


అనువాదకులు :

ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు, బి.ఎ.

# ప్రస్తావన

ఈవ్యాసము లన్నియు 1910-వ సంవత్సరము నకు ముందు అనగా శ్రీఅరవిందులు పాండిచేరికి రాక మునుపు, వంగదేశములో జాతీయోద్యమమున పాల్గొను కాలములో, 'కర్మయోగి' యను వారపత్రికయందు వారు ప్రచురించియుండిరి. కడపటి రెండు వ్యాసములను సోదరి నివేదిత వ్రాసినది.

శ్రీఅరవిందులు, చిన్ననాటనుండి, యీప్రపంచమునం దాధ్యాత్మిక యుగాగమమును గుఱించి కలలు గనిరి. ఈ భావముతోనే వారు వంగదేశ జాతీయోద్యమములో 1905-నుండి 1910-వఱకు పాల్గొనిరి. వారట్టిస్థితియందు వ్రాసినవ్యాసములే యివి. కాని మనోభూమికయందు, మానసికశక్తిచేత మహోన్నతాదర్శమును సాధించుట కష్టమని గుర్తెఱింగినంతనే, వారి సాధనవిధానమును మార్చి, ఆధ్యాత్మికభూమికయందు, ఆధ్యాత్మికశక్తితో వారి ఆదర్శమును సాధించనెంచిరి.

ఈ గ్రంథమందలి వ్యాసములను చదివినంతనే, యిట్టి మహోన్నతాదర్శములను మానవుడు ప్రపంచము

నందు సాధించనగునాయని సందేహము కలుగును. కాని శ్రీఅరవిందులనుగురించి, "వారు ఆదర్శమును, దేనినైనను భావించినంతనే దానిని ఆచరించుటయు, ఆచరించినంతనే సిద్ధింపచేయుటయు, వారి స్వభావము. ఇందుకు వారికి భగవంతు డన్నివిధముల తోడ్పడెను." అని శ్రీబిపిన్‌చంద్రపాలుడు చెప్పినరీతిగ, శ్రీఅరవిందులు యీవ్యాసములందు వచించిన భారతీయాదర్శములను ఆచరణలోనికి భారతీయులద్వారా ప్రపంచమునందు తెచ్చుటకును, వానిని సిద్ధింపచేయుటకును, వారు 1910- తర్వాత ప్రయత్నించిరి. ఇదెట్లు నెఱవేరుచున్నది యనుటను తెలిసికొనగోరువారు, వారి గ్రంథములను చదివియు, ప్రపంచపరిస్థితులను గమనించియు, గ్రహించవచ్చును.



ఇట్లు

చి॥ నారాయణరెడ్డిగారు.

# విషయ సూచిక





# కర్మయోగియొక్క ఆదర్శము

ప్రపంచవాసు లందరును నివ్వెరపడి చూచుచుండ భారతదేశమున నేడొకజాతి కోల్కొనుచున్నది. ఒకజాతి నిర్మింపబడుచున్నది. కండ్లున్నవారు, దృష్టికలవారు యీవిధాన మెంత త్వరితముగ జరుగుచున్నదో, యీదివ్యచిత్ర రచనారేఖలై దీనిని దోహదముచేయుచున్న శక్తు లెట్టివియో దీని కుపయోగింపబడుచున్న సాధన సామగ్రి యెట్టిదో పరిశీలించి చూడగలుగుదురు గాక!

ఈజాతి ప్రకృతి కర్మాగారము నుండి నిన్నగాక మొన్ననే యంకురార్పణమైన యర్భకజాతి కాదు; నూతన జాతియు కాదు. ఈజాతి యాధునిక విజ్ఞాన పరిస్థితులచే సృష్టింపబడినదియు కాదు. ప్రపంచజాతులలో నతిపురాణ జాతియై ప్రపంచోత్కృష్ట నాగరికతలలో నుత్కృష్ట నాగరికత కాలవాలమై అప్రతిహతమైన వీర్యప్రతాపములచే విరాజిల్లునదై యనేక మహోత్కృష్టపురుషులకు పుట్టినిల్లయి, జీవితగంభీర రహస్యముల నుగ్గుపాలుగా

గాని, మహాద్భుత శక్తులను ప్రదర్శించగల నిగూఢ తేజోబలముల సమన్వితమై, ఇతర విజ్ఞానములనుండియు, విదేశీయ రక్తమునుండియు ననూన బల సంపత్తులను చేకూర్చుకొని తిరుగ నిప్పు డీ జాతి ప్రపంచకళ్యాణము కొరకు జాతీయైక్యతను స్థాపించుకొనుచున్నది. ఇదివరలో నీజాతి ఒకే విజ్ఞానమును ఒకే జీవితమును గలిగియుండి ప్రధానమైన నీయేకత్వముచే నొక్కటియగుచున్నను తన యద్భుతసృజన సంపదచే భిన్నత్వమును, భేదమును కల్పించుకొనుచు, నొకే ఖండమగుట కడ్డు తగులుచున్న దుర్ఘటమైన యాటంకములను శాశ్వతముగా ఛేదించుకొనజాలక యుండెను. ఇప్పు డీ యాటంకములన్నియు నశించురోజులు వచ్చినవి. ఈజాతి తన చరిత్రలో గావించుకొనుచు వచ్చిన ప్రయత్నములనే యిప్పు డిదివర కెన్నడునులేని నూతన పరిస్థితులలో చేసికొనును. ఇదివరకు కలిగిన యాటంకములన్నియు నశించుటచేతను, నశించుచుండుటచేతను జయము తప్పదని దూరదృష్టి కలవారు కనుగొనవచ్చును. ఇంతేకాదు. భారతస్వేచ్ఛ, భారతైక్యత, భారతోత్కృష్టత ప్రపంచ కళ్యాణమున కిప్పు డత్యవసరమని మా దృఢవిశ్వాసము. ఇట్టి సంకల్పముతోనే, ఇట్టి దృఢవిశ్వాసముతోనే యెట్టి దుర్ఘటనములు సంభవించినను యెట్టి సంకటములకు లోనైనను సరకుచేయక కర్మయోగి ఈ జాతీయ నిర్మాణమున పాల్గొనును: పాల్గొనుచున్నాడు. భగవంతుడు మా కండగా నున్నాడని మా దృఢవిశ్వాసము.

ఈ విశ్వాసముతోనే మేము జయమును పొందనున్నార
ము. మానవలోకము మా సేవ నాశించుచున్నది. మా
నవ సేవయందు, మా దేశమందు, మా జాతియందు,
మా మతమందుగల యవ్యాజమైన ప్రేమయే మమ్మీ
ధర్మయుద్ధమునకు పురిగొల్పి మా హృదయములను పవి
త్రము చేయుచున్నది. మా కృషి రసహీనమైన యంత్ర
కృషి కాదు. నైతికాధ్యాత్మికములు దీనికి పట్టుకొమ్మ
లు. ఒక్క ప్రభుత్వ రూపమును మార్చుటమాత్రమే
మాలక్ష్యముకాదు. ఒకజాతిని నిర్మించుకొనుటే మా
సంకల్పము. ఈ మహోత్కృష్టకార్యములో రాజకీయ
ము లొక్క భాగము ఒక్క యంశము మాత్రమేయని
గుర్తించవలెను. మేమొక్క రాజకీయములనుమాత్రమే
యాదరింపజాలము. ఒక్క సాంఘికసమస్యలనే పట్టుకొని
వ్రేలాడజాలము. సాహిత్యము, శాస్త్రము, వేదాంత
ము, మీమాంసము, వీటితోమాత్రమే సరిపెట్టుకొన
జాలము. కాని యన్నిటిని తనలో నిముడ్చుకొనగలుగు
నతిప్రాముఖ్యమైన "ధర్మము"ను, జాతీయమతమును
నుద్ధరింపసమగట్టితిమి. ఇదియే విశ్వసమ్మతమగు "ధర్మ
ము"అనికూడ మా దృఢవిశ్వాసము. ఈ విశ్వచక్రము
నంతను త్రిప్పుచుండు అమోఘమైన జీవిత ధర్మము,
మానవపరిణామ సూత్రము, ఆధ్యాత్మిక జ్ఞానసంపత్తు
ఒకటికలదు. దీనిని రక్షించుటకు, ఆచరించుటకు ప్రచా
రముచేయుటకు భారతదేశమే యెల్లప్పుడును విధిచే
నియమింపబడుచున్నది. ఇదియే సనాతనధర్మము; అచం

చల ధర్మము; అవినాశమైనధర్మము. అనేక విజాతీయ సంపర్కదోషములచేత నీధర్మము, తన బాహ్యస్వరూప మును కోల్పోకపోయినను, చాలవరకు తన నిజతత్త్వ మును కోల్పోయెను. జీవితములో నాచరణలేనిచో, ననుభవములేనిచో, మన భారతమతము నిస్తేజమగును; నిర్వీర్యమగును. ఈ మతమును మనము జీవితములో నాచరించుటే కాక ప్రతిక్షణికమునను ప్రతి విషయము ననుకూడ ననుభవమునకు తెచ్చుకొనుచుండవలెను. మన రాజకీయములలోను, సాంఘిక విషయములలోను, సాహిత్యములోను, శాస్త్రములలోను, వ్యక్తులశీలము లోను, ఆశయములలోను, రాగములలోను నిది యది యననేల ప్రతి విషయములోను గూడ నీ సనాతనధర్మ తత్త్వమే తాండవించుచుండవలెను. ఈధర్మమే నీయన్ని టిని పాలించుచుండవలెను. ఈ ధర్మముయొక్కసారము ను గ్రహించుటే, ఈ ధర్మతత్త్వము ననుభవమునకు తెచ్చుకొనుటే, దీని యుత్తుంగభావతరంగములలో తేలి యాడుటే, దీనిని వ్యక్తపఱచి నిత్యజీవిత కర్మకలాప మును చూరగొనుటే—కర్మయోగము. ఈయోగమును మానవజీవితాదర్శముగా చేయుటకే భారతదేశము నేడు మేల్కొనుచున్నదని మా దృఢవిశ్వాసము. ఈ యోగ ముచేతనే భారతదేశము తన స్వేచ్ఛను, ఏకత్వమును, యుత్కృష్టతను సంపాదించుకొనుటకు తగిన బలమును చేర్చుకొనును. ఈయోగముచేతనే నది తన స్వరక్షణకు వలసినబలమును చేకూర్చుకొనును. ముందు రానున్నది

గొప్ప యాధ్యాత్మిక పరివర్తనము. భౌతికపరివర్తనము, విషయిక పరివర్తనము, దాని ఆధ్యాత్మిక పరివర్తనము యొక్క ఛాయయే, దాని ప్రతిబింబము మాత్రమే యని గ్రహించవలెను. పాశ్చాత్యునకు యంత్రమే కల్పతరువు. యంత్రమే మహామేరువు. అతడు మానవ లోకమును ప్రభుత్వవిధానముచేతను, సాంఘికపద్ధతుల చేతను నుద్ధరింపసమకట్టును. పార్లమెంటరీ ఆక్టులవలన భూలోకమును స్వర్గలోకముగా మార్చజూచును. యంత్రముల కెంతో ప్రాముఖ్యతగలదు: కాని యవి వెనుకనుండి పనిచేయుశక్తికి, తత్త్వమునకు, సాధనభూత ములుమాత్రమే కావలెను. 19-వ శతాబ్దపు భారత దేశము రాజకీయ స్వాతంత్ర్యమును, సాంఘిక పునరుద్ధ రణను మతపరివర్తనమును చేయ నుద్యమించెను. కాని యీప్రయత్నములు విఫలమయ్యెను. దీనికి కారణము మన జాతీయచరిత్రను, జాతీయతత్త్వమును, జాతీయ పరమావధిని విడనాడి పాశ్చాత్యపద్ధతులను, పాశ్చాత్య యాశయములను, పాశ్చాత్యపు పోకడలను తెచ్చిపెట్టు కొనుటయే. పాశ్చాత్యవిద్యను, పాశ్చాత్య యంత్రము లను, పాశ్చాత్యపద్ధతులను సాధనసామగ్రిని పాశ్చాత్య సంస్థాపనను తెచ్చిపెట్టుకొని, పాశ్చాత్యాభివృద్ధిచేతను పాశ్చాత్య శక్తులచేతను పాశ్చాత్య భోగ్యములచేతను భారతదేశమునకూడ పాశ్చాత్య భూతలస్వర్గమును నిర్మింపజూచితిమి! ఈ ఆంగ్లమానసజనితయైన వింశతి శతాబ్దపు యాశయములను, పద్ధతులను లక్ష్యములను

దాని యనుభవముచే బొప్పికట్టిన యిరువదియవ శతాబ్దపు వారమైన మన మనుకరించకుందుము గాక! ఈ సూత్రనికమును దేవతాస్వరూపముగా మన మంగీరింప జాలము. మనము ముందుకును వెనుకకును చూడ వలెను. మన అమోఘమైన జాతీయచరిత్ర కున్ముఖుల మై మనము సింహావలోకమును చేయవలసియున్నది. దానిచే మనకు విధింపబడిన మహోన్నతభావిచరిత్రి కొరకు ముందుకు చూడవలసియున్నది. శాశనసభలను పెద్దవిచేయుటచేతకాని, ఎన్నికసూత్రములను ప్రవేశ పెట్టుటచేత కాని, వలసదేశస్వాతంత్రంము నొసంగుట చేతకాని మరే పాశ్చాత్య రాజకీయ పద్ధతులచేతనైనను కాని, మనకు రాజకీయమోక్షము చేకూరుననువెఱ్ఱిని విడనాడవలెను. మన రాజకీయయుద్ధములో నివి కొంత ప్రయోజనకారులు కావచ్చును. కొన్ని పరికరములుగా నుపయోగించవచ్చును. కాని మేమివి సాధనములుగ గాని, ఆదర్శములుగగాని, యెంతమాత్రము నుపకరించని పరమావధికొరకే చూచుచున్నాము. ఈ బ్రిటీషు ప్రిభుత్వములో నొకకొట్టకొన రాష్ట్రిముగా నుండుటో, లేక పాశ్చాత్య నాగరికతకొకతొత్తుగ, క్రిందపడియుండు టో మా ఆశయమైనయెడల నివి చాలియుండును. ఇట్టి దౌర్భాగ్య భావిస్థితికొరకు మే మాశించుటలేదు. దీని కొరకెట్టిత్యాగలేశమైనను చేయనవసరము లేదు. భారతదేశము తన నిజస్వాతంత్ర్యజీవితమును, నాగరి కతను తానే నిర్మించుకొనగలదని మా దృఢవిశ్వాసము;

పాశ్చాత్య దేశములనుండి దిగుమతి చేయబడిన సంకుచితాభిప్రాయములచేతను హీనమతాభిప్రాయముల చేతను, దేశమున నూతనశాఖోపశాఖల ననంతముగా కల్పించుటచేత కాని హిందూమత బాహ్యశరీర బాహ్యాలంకారములను మాత్రమే శాశ్వత బ్రహ్మాకల్పములుగా గొంపోనెంచు సంస్థాపనలను సృష్టించుటచేగాని మన యాధ్యాత్మికారోగ్యమును, యాధ్యాత్మికశక్తిని, యాధ్యాత్మికోన్నతిని పునరుద్ధరించుకొనగలమని మేము విశ్వసించజాలము. ఈ ప్రపంచ మిప్పుడు స్వైరచింతన, విషయలోలతల కాస్పదమగు ననివార్యమైన యుగసంధినుండి యొక నూతన మత యుగమునకును, మతానుభవమునకును మారుచున్నది. ఈ నూతనమత ప్రపంచజీవితములో నన్యోన్య సమాన మేర్పడును. అట్లని మతవిశ్వాసము, మతావేశము నెంతమాత్రమును తరుగక యథార్థ మతమునం దచంచలమైన విశ్వాసముండుటచే నన్నిమత స్వరూపములనుగూడ నది అంగీకరించును. మతమొక్కటే; స్వరూపములు భిన్నములు. శాస్త్రమును విశ్వాసమును దేవతారాధనను క్రైస్తవమతమును మహమ్మదీయమతమును బౌద్ధమతమును ఈయన్నిటిని ఆశ్లేషించుచు కౌగలించుచు నివేవియునుకానట్టి మతముకొరకే ప్రపంచాత్మ యిప్పుడు సమకట్టినది. అతిగా సందేహించునట్టియు, (యీమతము ప్రతి విషయమునుగూడ మథనముచేసి యనుభవపూర్వకముగా తెలిసికొనువరకు నూరకుండజాలదు) అతిగా విశ్వసించునట్టియు, దీని కతి

గంభీరమై, వివిధమై, నిశ్చయమైన యాధ్యాత్మికానుభవ జ్ఞానము కలదు. ధర్మపన్ననముగాని ధర్మపన్ననముల నేకరువుబెట్టు సమూహముగాని గాక, జీవితధర్మమును బోధించునట్టియు, సాంఘిక యంత్రస్వరూపముగాక, భూతభవిష్యత్సాంఘిక పరిణామ తత్త్వమైనట్టియు, దేనిని తిరస్కరించక, ప్రతిదానిని పరీక్షించి యనుభవమునకు తెచ్చుకొని పరీక్షానుభవము లైనతరువాత నాత్మ ప్రయోజనమునకు వినియోగించునట్టియు నగు విశాల హిందూమతమే భావిప్రపంచమతమునకు పునాది కాగల దు. ఈ సనాతనధర్మమునకు వేదము, వేదాంతము, గీత, ఉపనిషత్తులు, దర్శనములు, పురాణములు, తంత్రములు మొదలగు ననేక మతగ్రంథములు కలవు. బైబిలు, ఖురానులనుగూడ నిది తిరస్కరింపజాలదు. కాని దీని నిజమైన, అతిప్రామాణ్యమైన మతగ్రంథము, సనాతను డైన ఆ పరాత్పరుని యాలయమైన హృదయమే! ప్రపంచ మత గ్రంథముల యొక్క ప్రామాణ్యమును, మూలమును మనము మన యాంతరంగి కాధ్యాత్మికాను భవములోనే కనుగొనవలెను. అచ్చటనే మనము జ్ఞాన, ప్రేమ శీలములయొక్క ధర్మమును కనుగొనవలెను.

కనుక మానవ కళ్యాణముకొరకు భారతదేశ మును నిర్మించుకొనుటకు తోడ్పడుటే మా లక్ష్యము. మే మాశించునట్టి జాతీయతత్త్వ మిదియే. మేము మానవలోకమునకు "మీరు మీవిషయాసక్త జీవితము నుండి మేల్కాని మానవలోక మాశించుచున్న గంభీర

మైన, విశాలమైన, యత్యున్నతమైన జీవితము ననుస రింపవలసిన సమయ మేతెంచినది. మానవలోకము నెదుర్కొనుచున్న క్లిష్ట సమస్యలను సాధించుటకు మొట్టమొదట యాంతరంగిక రాజ్యమును జయించవలె ను. కాని ప్రకృతిశక్తులను మన భోగములకొరకును, సౌఖ్యములకొరకును, వినియోగించుకొనుటచే సాధించ జాలము. బుద్ధిబలమును, ఆత్మశక్తిని, వశపరచుకొని, మానవస్వాతంత్ర్యము నాంతరంగికముగను, బహిరంగ ముగను కూడ స్థిరపరచుకొని అంతరంగమునుండి బా హ్యప్రకృతిని జయించవలెను. ఈపనికి ఏషియా యుద్ధ రింపబడవలెను గనుకనే యేషియా లేచుచున్నది. ఈ పనికి హిందూదేశముయొక్క స్వేచ్ఛయు, నుత్కృష్టత యు ముఖ్యావసరములు. కనుకనే హిందూదేశము విధి నిర్ణీతమైన తన యుత్కృష్టతను, స్వేచ్ఛను కోరుచున్నది. ఇట్లు భారతదేశము తన యధికారమును స్థాపించుకొను ట మానవలోకమంతకును, చాల ప్రయోజనకారి'' అని యెలుగెత్తి చాటుచున్నాము. మనము మనమే కావలెను గాని యెూరపు కాగూడదనట్లు భగవన్నిర్ణీతమని మేము జాతికిచెప్పుచున్నాము. మనము మన శరీరధర్మములను విడిచి యితరులశరీర ధర్మములతో జీవితము నుజ్జీవింప చేయదలచితిమి. మనమీ ప్రయత్నములను విడిచి మన లోనే మన బలప్రాణముల పెన్నిధానమును కనుగొన వలెను. మనము మన భూతచరిత్రను తెలిసికొని దానిని మన భవిష్యదర్థములకు వినియోగించుకొనవలెను. మన

లను మనము గ్రహించుకొనుట మన ప్రథమ కర్తవ్యము. తరువాత మనము ప్రతిదానిని భారత సనాతన జీవితధర్మముకును, భారతప్రకృతి ధర్మమునకును నను వర్తించులాగున పోతపోసికొనవలెను. కనుక కర్మయోగి మొట్టమొదట మనమత, సాంఘిక, వేదాంత, రాజకీయ, సాహిత్య, కళాన్యాయశాస్త్రాది సర్వవిషయముల సారము గ్రహించవలెను. మనదైన ప్రతి భూతవర్తమాన విషయమును మధనముచేయవలెను. అట్లుచేసి, మనము 'ఇదిమాధర్మము' అని మనకును, మన జాతికిని చెప్ప గలిగియుండవలెను. మనము పాశ్చాత్య నాగరికతను భారతీయులవలె, భారతవిజ్ఞానదృష్టితో విమర్శించి మనపై రాజ్యము చేయుచున్న పాశ్చాత్యవాసనలను పాశ్చాత్య చిహ్నములను విడనాడవలెను. మనము పాశ్చాత్యులనుండి గ్రహించవలసినదానిని భారతీయులముగనే గ్రహించవలయును. మనధర్మము మనకు గోచరమైన తోడనే మనము దానిని చాటుటేకాక మన, వ్యక్తి నిత్యకర్మ కలాపములోను, మన సాంఘిక జీవితములోను, రాజకీయ ప్రయత్నములలోను ఈ యన్నిటిలోను కూడ నాధర్మమునే యాచరించుటకు ప్రయత్నించ వలెను. వ్యక్తులకు ముఖ్యముగా భారతసేవను, ప్రపంచసేవను భగవత్సేవను చేయుసమకట్టుచున్న యువకులకు మేమిట్లు చెప్పుచున్నాము. "యువకులారా! పాశ్చాత్యాభిప్రాయములకు మీ మనస్సులు దాస్యమైపోయినను, జీవితమును మీరు ప్రపంచదృష్టితో చూచినను మీరీ

యాదర్శములను నెరవేర్చుకొనలేరు. సరికదా వాటిని తలపోయనైనను తలపోయజాలరు. ప్రాపంచికముగా గూడ మీరు పెద్ద బండిసున్న. ఆధ్యాత్మికముగా నైనచో మీకు సర్వమును కరతలామలకమే! ఒక్క భారతీయుడే ప్రతిదానిని విశ్వసించగలడు, ఒక్క భారతీయుడే ప్రతి దానికిని సాహసించగలడు! ఒక్క భారతీయుడే సర్వము ను త్యజించగలడు! కనుక మొట్టమొదట భారతీయులు కండు! మీ పూర్వుల పిత్రార్జిత విజ్ఞానధనమును స్మర ణకు తెచ్చుకొనుడు! సేకరించుకొనుడు! ఆర్యభావము ను, ఆర్యధర్మమును, ఆర్యశిక్షణమును, ఆర్యశీలమును, ఆర్యజీవితమును, ఆర్యప్రతిష్ఠను తిరుగ ప్రతిష్ఠించుకొను డు. వేదాంతమును, గీతను, యోగమును పునస్థాపన చేసికొనుడు. వీటిని మీరు మీ బుద్ధిచేతను పూజ్యభావ ములచేతను స్వీకరించిన చాలదు. మీ జీవితములలో వీటిని చూరగొనవలెను, ఉద్ధరించవలెను. మీరు వీటిని మీజీవితములలో ప్రతిష్ఠించుకొంటిరేని భయరహితులు, అజేయులు, అమోఘబలసంపన్నులు, ఉత్కృష్టులు కాగలరు. జీవితము యొక్కయు మృత్యువుయొక్కయు భయంకరరూపములు మీ ముందర పలాయనమగును; అసాధ్యములు, దుర్ఘటములు మీ నిఘంటువులనుండి పెరికివేయబడును. ఆత్మబలమె సనాతనబలము. మీ బాహ్యసామ్రాజ్యమును స్థాపించుకొనుటకు పూర్వము మీరు మీ యాత్మసామ్రాజ్యమును చూరగొనవలెను. ఆదిశక్తి జగదీశ్వరి, మన అంతరముననే నివసించునది;

ఆమెమీకు బలము నొసంగుటకు మీ సపర్యల కొరకు వేచియున్నది. ఆమెయందు విశ్వాసముంచుడు. ఆమెను సేవించుడు మీ సంకల్పములను 'మాత' సంకల్పములో లీనము చేయుడు! మీ అహంకారమును దేశమాత యహంకారములో హోమము చేయుడు. మీ వ్యక్తి స్వార్థములను మానవసేవ కర్పణసేయుడు. మీలోపల నున్న సమస్తబల నిక్షేపములను, కనుగొనుడు. దాని తో సర్వసంపదలును| వాటంతటవియే మీకు సమకూడును; సాంఘికారోగ్యము, బుద్ధితీక్ష్ణత, రాజకీయస్వాతంత్ర్యము, పరమనోవశీకరణము ప్రాపంచికాధిపత్యము కూడ మీకు తప్పక సిద్ధించును.



యాదర్శములను నెరవేర్చుకొనలేదు. సరికదా వాటిని తలపోయనైనను తలపోయజాలదు. ప్రాపంచికముగా గూడ మీరు పెద్ద బండిసున్న. ఆధ్యాత్మికముగా నైనచో మీకు సర్వమును కరతలామలకమే! ఒక్క భారతీయుడే ప్రతిదానిని విశ్వసించగలడు, ఒక్క భారతీయుడే ప్రతి దానికిని సాహసించగలడు! ఒక్క భారతీయుడే సర్వము ను త్యజించగలడు! కనుక మొట్టమొదట భారతీయులు కండు! మీ పూర్వుల పితార్జిత విజ్ఞానధనమును స్మరణకు తెచ్చుకొనుడు! సేకరించుకొనుడు! ఆర్యభావమును, ఆర్యధర్మమును, ఆర్యశిక్షణమును, ఆర్యశీలమును, ఆర్యజీవితమును, ఆర్యప్రతిష్ఠను తిరుగ ప్రతిష్ఠించుకొనుడు. వేదాంతమును, గీతను, యోగమును పునస్స్థాపన చేసికొనుడు. వీటిని మీరు మీ బుద్ధిచేతను పూజ్యభావములచేతను స్వీకరించిన చాలదు. మీ జీవితములలో వీటిని చూరగొనవలెను, ఉద్ధరించవలెను. మీరు వీటిని మీజీవితములలో ప్రతిష్ఠించుకొంటిరేని భయరహితులు, అజేయులు, అమోఘబలసంపన్నులు, ఉత్కృష్టులు కాగలరు. జీవితము యొక్కయు మృత్యువుయొక్కయు భయంకరరూపములు మీ ముందర పలాయనమగును; అసాధ్యములు, దుర్ఘటములు మీ నిఘంటువులనుండి పెరికివేయబడును. ఆత్మబలమె సనాతనబలము. మీ బాహ్యసామ్రాజ్యమును స్థాపించుకొనుటకు పూర్వము మీరు మీ యాత్మసామ్రాజ్యమును చూరగొనవలెను. ఆదిశక్తి జగదీశ్వరి, మన అంతరముననే నివసించునది;

ఆమె మీకు బలము నొసంగుటకు మీ సపర్యల కొరకు వేచియున్నది. ఆమెయందు విశ్వాసముంచుడు. ఆమెను సేవించుడు మీ సంకల్పములను 'మాత' సంకల్పములో లీనము చేయుడు! మీ అహంకారమును దేశమాత యహంకారములో హోమము చేయుడు. మీ వ్యక్తి స్వార్థములను మానవసేవ కర్పణ సేయుడు. మీలోపల నున్న సమస్తబల నిక్షేపములను, కనుగొనుడు. దానితో సర్వసంపదలును| వాటంతటవియే మీకు సమకూరును; సాంఘికారోగ్యము, బుద్ధితీక్ష్ణత, రాజకీయస్వాతంత్ర్యము, పరమనోవశీకరణము ప్రాపంచికాధిపత్యము కూడ మీకు తప్పక సిద్ధించును.



# కర్మయోగము

వేదాంతమును, యోగమును జీవితముతో నేకీభ వింప జేయుటే, వీనిని జీవితములో చూరగొనుటే కర్మ యోగమని మేము చెప్పియున్నాము. హిందూమతమును గూర్చి ప్రత్యక్షముగగాక కర్ణాకర్ణికగా తెలిసికొనిన వారికిది అసందర్భ నిర్వచనమువలె కాన్పించవచ్చును. వేదాంతము జీవితమును నడుపజాలదనియు, యోగ మాధ్యాత్మిక సంయోగమును చేకూర్చజాలదనియు,నివి రెండును మానవులను కర్మనుండి యకర్మకు తీసికొని పోవుటచే నపాయకరములనియు ప్రత్యక్షము! ప్రత్య క్షము! అని కొట్టుకొను "ప్రత్యక్ష" వాదులు సాధారణముగా వాదించుచుందురు. ఇట్టి విశ్వాసము లు బూటకములు, ఆత్మవంచకములు, అగమ్యములు, అగోచరములు అని భావించువారి కొక్క నమస్కారము; కాని హిందూమతములోని యుత్కృష్ట విషయములను విశ్వసించువారుకూడ యాధ్యాత్మిక జీవనమును నడుపు టకు సంపూర్ణ మానవకర్మకలాపమునుండి తొలగిపోయి తీరవలెనను యభిప్రాయములకు లోనగుచున్నారు.

వేదాంతధర్మము నలవఱ్చుకొని, యోగబలమును చేకూ ర్చుకొని సామాన్య మానవజీవితమును గడుపు మాన వుని లోనే ఆధ్యాత్మికజీవిత మప్రతిహత మగుచున్నది. అంతరంగిక జీవితమునకును, బహిరంగ జీవితమునకును నిట్టి సామరస్య మున్నపుడే మానవలోక ముద్ధరింపబడ గలదు. అప్పుడే మానవలోక మమోఘదివ్యత్వములను బడయగలదు. వేదాంతము జీవితమున కుత్తేజము నీయ జాలదనియు, ధర్మనిర్ణయమును చేయజాలదనియు, ఊక దంపువంటి కుతర్కకూపమనియు, నిర్జీవమనియు యను కొనుట భ్రమజనితమని మా యభిప్రాయము. ఇంతేకా దు. మానవలోకము ప్రదర్శింపగల యత్యుత్తమ నీతి కాధారమును తత్సమర్థనమును, మనకు భగవద్గీతలోను ఉపనిషత్తులలోను కాన్పించుచున్నవి. భగవద్గీతా సూత్రములన్నియు జీవితధర్మమునుగూర్చినవి కానిచో వాటి నేమనవలెనో తెలియరాకున్నది. అవన్నియు ధర్మప్రతిపాదకములు కావా! వేదాంతము యొక్క యత్యుత్తమాముష్మికాశయములు కూడ జీవితములో సాధనసంపత్తును శాశించుటలేదా? జీవితద్వారముననే కదా ఎవడైన నమరత్వమును సాధింపగలుగునది? మన జాతియొక్క చరిత్రలోను, జాతీయాంతఃకరణము లోను కొన్ని క్రొత్త పోకడలువచ్చి చేరుటే యిట్టి విప రీతాభిప్రాయములకు కారణమైనది. ప్రకృతి శృంఖముల నుండి తప్పించుకొనుటయే జన్మరాహిత్యమును చేసికొను టయే మనమతముయొక్క పరమావధి. మన మెరిగిన

యత్యుత్కృష్ట పురుషులలో కొందరీ పరమావధిలోని పవిత్రతచేతను, ఆనందముచేతను నాకర్షింపబడి తస్సిద్ధిని సులభముగాను, త్వరితముగాను సాధింపనెంచి జీవితముతోను, ఐహికకర్మలతోను సంబంధమును తెంచుకొనిరి. అట్టివారు సామాన్యమానవకోటిలో పర్వతశిఖరములవలె మెరయుచుండుటచే యందర నాకర్షించి తమవలె ప్రపంచమును విడిచిపెట్టుటే యత్యుత్కృష్టమై యద్వితీయమైన హిందూమతాదర్శమని స్థిరపరచిరి. కనుకనే యోగీశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో పరిపూర్ణయోగిజీవితమును, మానవకర్మకలాపమును [తనవ్యక్తికట్టియక్కరతీరినను] వీడరాదనియు, శ్రేష్ఠులైనవా రాచరించుదానినే సామాన్యు లెప్పుడును ఆచరించుచుందురనియు నందుచే ప్రజలు తమతమ నిజధర్మములను వీడుటచే ప్రపంచమల్లకల్లోల మగునని యు, చెప్పియుండెను. ఆదర్శయోగి ఒకమహాశక్తి సంపన్నుడు. అతడొక దివ్యజ్యోతికాని, యడవిని కాచిన వెన్నెలకాదు. తన దివ్యశక్తిని ప్రపంచముపై కురిపించుచుండుటచేగాని, లేక తానే మానవ లోకమున కధినాయకుడై, జగత్కళ్యాణ సంధానకర్తయై, సూత్రధారుడై, అగ్రేసరుడై తన కర్మపాశములచే పట్టుపడక, తన నిమిత్తశరీరముకంటె విశిష్టుడై మానవలోకమును ముందరకు రణరంగమునకు గొంపోచుండుటచే గాని యతడు నిరంతరము సర్వప్రపంచమునకును మేలుచేయుచుండుటలో నిమగ్నుడై యుండును.

వేదాంతశబ్దమునకు సామాన్యముగా శ్రీశంకరాచార్యులవారి యుత్కృష్ట బుద్ధిబలముచే స్థాపింపబడిన మాయావాదమనియు, కేవలాద్వైతమనియు నర్థమును చెప్పుచున్నారు. కాని వేదాంతికి ప్రమాణగ్రంథముపనిషత్తులు; అవియే మూలము. కాని వాటిమీద వ్రాసిన శంకరులవారి వ్యాఖ్యానముగాదు. ఉత్కృష్టమై, తాత్కాలిక ప్రయోజనకారియైన శ్రీశంకరులవారి యుపనిషదర్థ మొకవ్యాఖ్యానము మాత్రమే యగుచున్నది, ఒక సమన్వయము మాత్రమే యగుచున్నది. మన జాతీయతను, జాతీయభావములను, జాతీయహృదయమును సన్నిహితముగా పాలించిన సమన్వయములిట్టివి వెనుకను జరిగినవి. భవిష్యత్తులోకూడ నింతకంటె యెక్కువ పరిపూర్ణమైన సమన్వయ మేలజరుగకూడదు? రామకృష్ణ, వివేకానందుల బోధనలు జీవితమునంతను, కర్మకలాపమునంతను నిమిడ్చుకొనగలుగు సమన్వయమునకే ప్రయత్నములుచేయుచున్నవి. వెనుక బుద్ధు డార్యజాతులకు వేదాంత, ధర్మబోధనలను చేసినపుడు జరిగిన చరిత్రయే యిప్పుడును జరుగబోవుసూచనలు దూరమునుండి కాన్పించుచున్నవి. ఇప్పటివలెనే అప్పుడును, అవతారముకానిండు విభూతికానిండు, మానవాకారమునయున్న భగవత్స్వరూపము కానిండు, దివ్యతేజస్సుయొక్క యమోఘవృష్టికానిండు, మానవలోకమునకు వచ్చి వారి నిత్యజీవితములోను, అనుభవములోను పూర్ణమైన యాధ్యాత్మికశక్తిని, ప్రబోధమును కలుగ

జేసెను. ఈసారి బౌద్ధమతమువలె నొకభాగముమాత్ర
గాక సంపూర్ణ తేజస్సేరాగలదు. బౌద్ధమతము వేదాం
ధర్మమునే బోధించినను వేదాంతముయొక్క ప్రధా
తత్త్వమునే నిర్లక్ష్యముచేయుటచే నది తన జన్మస్థానమ
నుండి తఱుమగొట్టబడినది. దాని ఫలితమిప్పుడు జరు
బోవునట్లే అప్పుడును దేశములో గొప్ప రాజకీయ, సై
క, సాంఘిక పరివర్తనములు జరిగి నాగరిక ప్రపం
మున కంతయు భారతదేశము గురుస్థానమును వహించ
తన దివ్యజ్యోతి నొసంగి, ఇప్పటికిని జీవించి శక్తివంతః
గానున్న భావములను, రూపములను ప్రసాదించెన
వేదాంతము, యోగము నిదివరకే తమ యాసియ
సరిహద్దులనుదాటి యూరపు అమెరికాలకు ప్రాకి ప
జీవిత అనుభవములపై తమ యధికారమును చలాం
చుచున్నవి. ఇంక ననేక అప్రత్యక్షమార్గములద్వా
నవి పాశ్చాత్యుల మనోసీమల నధిష్ఠించుచున్నవి. క
యివి యింకను చిన్నచిన్న పిల్లకాలువలు సెలయేళ
పరిపూర్ణ దివ్యతరంగములలో మునిగి తేలియాడుట
ప్రపంచము భారతాభ్యుదయముకొరకు వేచియున్న
జ్ఞానముకొరకు, భక్తి ప్రేమకొరకు, లేక కర్మకలాప
కొరకు భగవంతునితో నేకీభావము నలవర్చుకొను
అతనితో సంధానైక్యతయే యోగము. యోగి మ
వుని బహిరంతములలో నున్న విశ్వశక్తితో, విశ్వ
ముతో ప్రత్యక్షబాంధవ్యమును కలిగి యుండవలె
అత డనంతశక్తితో సామరస్యమును కలిగి, ఆ సర్వ

మయుని తేజోబలములను ప్రపంచముపై శాంత, దాంత, దయ, ప్రేమాదిరస, వృష్టిచేగాని, కళ్యాణ కార్యములచే గాని గొంపోవుచుండు నదీ తోయముల వంటివాడు. మానవుడు స్వార్థపంకిలమును విడనాడి పరోపకారార్థముగ జీవించుచు పరుల సుఖదుఃఖములనే తన సుఖదుఃఖములుగా భావించుట, ప్రేమపూర్వకముగ పట్టుదలతో సంపూర్ణసౌందర్యముతో కృషిసలుపుచు ఫలాశక్తి లేక అపజయమునకు భయమునుగాని, జయమున కుత్కంఠతనుగాని లేకయుండుట; తన సర్వస్వమును, సర్వక్రియలను, భగవదర్పణముచేసి, మనోవాక్కాయ కర్మల నతివినయముతో నా దివ్యపాదారవిందములకు సపర్యపురస్సరముగా నర్పించుట; భయ ద్వేషములను, అనురాగ విరాగములను, కామక్రోధములను సన్యసించి ప్రకృతిశక్తులవలె నిరంతరాయముగా నుద్రేకరహితముగా, నిశ్చలముగా, యశ్రాంతముగా పనులను చేసికొనిపోవుచుండుట; శరీరము, మనస్సు, హృదయము మొదలయినవిగాని, యివన్నియు కలసిగాని తాను గానను భావమునుకలిగి, తన నిజతత్వమును గ్రహించుట; మృత్యువుయొక్క అసత్యతను, తన యమరత్వమును తెలిసికొనుట; జ్ఞానోదయానుభము కలిగి, తా నకర్తయైయుండ దివ్యశక్తి తన మనోవాక్కాయకర్మలద్వారా తన జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల ద్వారా నిరంతరాయముగా పనిచేసికొనుచున్నట్లు గ్రహించుట; ఈవిధముగా తా నేమిచేసినను,

నేమి యనుభవించినను, నేమి తలంచినను, తన కేమి యున్నను, తా నేమైనను సర్వమును ప్రేమసింధువై మానవుని కేంద్రమైయున్న యా సర్వేశ్వరున కర్పించు టే; ఇదియే యోగము. ఇట్టివా డెల్లపుడు నా పరాత్పరు నందే నివసించుచు, దుఃఖములకును, అశాంతికిని, అసత్య భావోద్రేకములకును పాలుగాజాలడు. ఆసనములు ప్రాణాయామము, ధ్యానము, పూజా పునస్కారములు కర్మకాండలు, మతాచారములు మాత్రమే యోగము కానేరవు. అవి యోగమునకు సాధనములు. అయినను యోగముకూడ నెంతమాత్రమును కఠినమైనదిగాని యుపద్రవకరమైనదిగాని కాదు. మన యంతరంగికో ద్బోధకుడును, నాయకుడును అగువాని ప్రాపుగోరినవారి కతిసులభము; క్షేమకరము. ప్రతి మానవునకును దీనిని సాధించగలశక్తి ప్రచ్ఛన్నముగా కలదు. విశ్వాస, ప్రేమ బలములు ప్రతి మానవునిలోను ప్రచ్ఛన్నముగనో సాధన సంపత్తిచే పరిపక్వత నొందియో యుండును. ఇం దేయొకటియైనను కూడ యోగికి తగినంతశక్తి నొసగ గలదు: ఈ మార్గమున ప్రతివాడును ఒకజన్మములోనే పరమావధికి పోజాలడుగాని ప్రతివాడును పురోభివృద్ధి గాంచగలడు. ఈ విధముగా మనుష్యు డెంత యభివృద్ధి నొందునో యంత శాంతి, శక్తి, ఆనందమును చేకూరును గీతలో చెప్పబడినట్లు "స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతే మహతోభయాత్" ఈ ధర్మమును కొంచ మాచరించి నను యిది యేదేశమునుగాని, మానవునిగాని గొప్ప

భయమునుండి కాపాడగలదు. ఆధ్యాత్మికములకు జీవితముతో పని లేదనుకొనుట వట్టి పొరపాటని తిరుగ చెప్పుచున్నాము“ నీవు విశ్వము ననుభవించవలెనన్న సర్వమును త్యజింపుము. ఇతరుల తృణముకొరకైన నాశింపకుము. కాని నీ విధాయక కృత్యముల నొనర్చుచు నీ నూరేండ్లను బ్రతుకుము. నీ కర్మపాశములనుండి విడివడుటకు నీ కింతకన్న వేఱు తరుణోపాయము లేదు” అని ఈశోపనిషత్తు చెప్పుచున్నది. మతము ఈ ప్రపంచ సంకులముల కతీతమైన హిమవన్నగాగ్రమువంటిదని యనుకొనకూడదు. గీతలో శ్రీకృష్ణుం డర్జునున కనేక పర్యాయములు యుద్ధమును చేయవలెనని బోధించి యుండెను. “యుద్ధముచేసి నీ శత్రువులను జయించుము. నన్ను స్మరించుకొనుచు యుద్ధముచేయుము. అన్ని కోరికలను త్యజించి, నేను చేయుచున్నాను అను అహంకారమును విడిచి, పరిపూర్ణాధ్యాత్మికభావముతో నీ సర్వకార్యములను నా కర్పింపుము. యుద్ధముచేయుము” ఇదియేకదా గీతయొక్క బోధ! మతాసక్తుడైన మానవుడు సామాన్య కర్మలను చేయుచున్నను కంటకభూయిష్ఠమైన ప్రపంచ కర్మాచరణకు తగిన, యాథార్థ్యమును, కాఠిన్యమును, సాహసమును, నిర్దాక్షిణ్యమును వహింపజాలడనుకొనుటకూడ పొరబాటు. దీనికి విరుద్ధముగా గీతలో చెప్పబడిన ప్రత్యుత్తరమును చూడుడు! “అహంకార వర్జితమైన యంతఃకరణమునుకలిగి, కర్మబంధము తనయాత్మ కెంతమాత్రమును తగులకుండ

సంచరించువాడు ప్రపంచమునంతను సంహరించినను తాను హంతకుడుకాజాలడు. అతనికే బంధమును లేదు.'' కురుక్షేత్రమున ప్రలయతాండవరంగమున యర్జున రథసారథ్యమును వహించిన శ్రీకృష్ణభగవానుడే నిజమైన కర్మయోగి! కర్మయోగముయొక్క నిజమైన నిర్వచనమిదియే! శరీరమే రథము; ఇంద్రియములే గుఱ్ఱములు; రక్తసిక్తమై పంకిలావిష్టమైన ప్రపంచమార్గముల ద్వారముననే శ్రీకృష్ణుడు మానవాత్మను వైకుంఠమునకు తీసికొనిపోవును.



# ఏ మార్గమైనను సరే

మానవలోకమునకు, ఉత్పతన అధోపతనములను రెండుగతు లున్నవి. ఈ రెండునుకూడ నప్రతిహతమైనవే! దైవోపహతమగు కార్యము కీలూడిన బొమ్మవలె నేలగూలుట తప్పదు; కాని దానినే పట్టుకొని వ్రేలాడువారికి దానిపతన మాగిపోయి ముందుకుపోవుచున్నట్లొక క్షణికకాలము తోచవచ్చును. వారిట్లు మురియవచ్చును. ఒక మతము యొక్క ఒక భావము యొక్క, ఒకజాతియొక్క అమోఘాభ్యుదయ మొక తృణికాలము బలవంతముగా నాపివేయబడవచ్చును. అఖండ పరిశ్రమచే నాచక్ర మొక యంగుళము వెనుకకు మరలింపబడవచ్చును; లేక రెండంగుళములు ముందుకు పోవచ్చును. కాని భగవంతుని వంచనచేయుట యెవరి తరము. అతడు దౌర్జన్యముచే జయింపబడనేరడు. అతడు సారథియైనచోట జయము నిశ్చయము. అతడు వెనుకకు మరలినచో తనకింక నెంతమాత్రమును యుపయోగము లేని ప్రదేశమును విడిచి జయము నిశ్చయమైన మరియొకస్థలమున కావహారంగమును మార్చుటకే యత

డట్లు చేయును. అతడు తఱచుగా తన శత్రువును తన స్థాక స్థలమునుండి మఱియొక స్థలమునకు పాఱదోలునట్లు చేసి తా నెప్పుడును శాశ్వతముగా కోరనట్టి ప్రదేశమును కాపాడుచు, ఈ జయపరంపరలచేతనే శత్రువు వలసిపోవు నట్లు చేసి ముక్కుకుత్రాడువోసి లాగికొనిపోవు వానివలె వానిని సంపూర్ణ పరాజయమునకు గొంపోవును.

దుర్బలమనస్కులు చిన్నచిన్న విజయములనే లెక్కగొనుచు "మే మిచ్చట జయించితిమి. మే మచ్చట పరాజయముగాంచితిమి" అను దంభోక్తులను పలుకుచు తమ సంశయాస్పదమైన జయములకన్న పరాజయము లెక్కుడైనచో భూమికంటునట్లు క్రుంగిపోయి, ధైర్యముచెడి తమ కార్యములకు నాశమును తామే తెచ్చిపెట్టుకొందురు. ఈవిధముగా మానవులు తనతో సర్వమును గొంపోవు ననివార్యకాలవాహినీ సౌందర్యమును చూచుటకు జ్ఞానచక్షువులు లేక నడుమ నడుమ గలుగు బుద్బుదములచేతను, సుడిగుండముల చేతను మోసపోవుచుందురు; విధిగా నపజయ మెచ్చట కొంత కాలము శాసింపబడినదో చూడలేక, విశ్వాసహీను లగుటచే స్థైర్యము చెడి తమరనుకొనిన దుఃఖములను తామే తెచ్చిపెట్టుకొందురు. విశ్వాసదృష్టి వేరు; జ్ఞాన దృష్టి వేరు. జ్ఞానము దేనిని స్పష్టముగా, నిర్దుష్టముగా చూచునో దానిని భక్తి,విశ్వాసము దూరమునుండియే పసిగట్టును. చిత్రించుకొనును. కాని మొత్తముమీద

విశ్వాస జ్ఞానములు రెండును ఒకదానినొకటి విడువ కూడదు. భక్తునియొక్క పరిజ్ఞానమే జ్ఞానియొక్క పరిజ్ఞానముచే బలపరుపబడుచున్నది సమర్థింపబడుచున్నది. విశ్వాసము భగవంతునికొరకు పోరు సలుపును. జ్ఞానము తత్సిద్ధికొరకు వేచియుండును. జ్ఞానము కలుగునంత కాలము విశ్వాసమే యుండవలెను. అద్వితీయమైన విశ్వాసముగాని, దివ్యమైన పరిజ్ఞానముగాని లేనిచో నెట్టి ఘనకార్యమును సాధించజాలము.

కనుక తాత్కాలికముగా సంభవించుచుండు చిన్నచిన్న వివరములను మనము మొత్తముమీద జరుగుచుండు యుత్కృష్టకార్యప్రవాహ దృష్టితోనే గ్రహించుచుండవలెను. మొత్తముమీద విషయములన్నియు ముందుకుపోవుచున్నవా? లేక వెనుకకు మరలుచున్నవా? అవి వెనుకకు పోవుచున్నను మనము మనకార్యముల నెంతమాత్రమును విరమించగూడదు. జయములేదని ధర్మమైన కార్యమును విడనాడువాడు ద్రోహి. పాపి. నీచాత్ముడు. అట్టివాడు మానవలోకమునకు భవిష్యద్వర్తమానములలో గూడ తీరని హానినొనర్చినవాడగుచున్నాడు. చివరకును ధైర్యసాహసములతో కొనసాగింపబడిన ఘనకార్యము లెప్పుడును ఆ సాహస బాధలచే పవిత్రము లగుచుండును. అంత్యమునకు వాటి జయము నిశ్చయము. వాటి పునరుద్ధారణ ధృవము. అధీరులగువారిచే ప్రారంభింపబడి కార్యరంగ మధ్యమున హేయముగా విడువబడిన కార్యములు భవిష్య

చరిత్రలో నిర్మూలము చేయబడును. మధ్యయుగములో ఫ్రాన్సు, యిటలీలలో జరిగిన స్వాతంత్ర్యసమరము విఫలమై ట్యూటనుల నిరంకుశప్రభుత్వములకు స్థానమిచ్చెను. కాని యది ఫ్రాన్సుపరివర్తనములో తిరుగ నూరురెట్లెక్కువగా విజృంభించి మానవులలోని ప్రపంచ విషయ సంగవేగముచే నూరులకొలది వత్సరములు నిరంతర పోరాటముజరిగి, కొంతకాలము జయభేరిని మ్రోగించిన యనేక ప్రభుపాలనమును విధ్వంసముచేసెను. కాని మనమార్గము మనలను ముందుకే తీసికొని పోవునదైనయెడల (ఇది ముమ్మాటికిని సత్యము)మనము సంపూర్ణ విశ్వాసముతోనే భల్లూకపు పట్టును పట్టవచ్చును. చిన్నచిన్న వివరములలో సంభవించు పరాజయములు జయమును చేకూర్చు అమోఘమార్గమును సూచించుటకే యుద్దేశింపబడును.

పట్టుదల యనగా ప్రయోజన రహితము లైన నిరూఢి పద్ధతులనే మరలమరల పట్టుకొని ప్రాకులాడుట కాదు; తాత్కాలిక జయము కలిగినను భగవంతుని యామోదమును బడయని పద్ధతుల నవలంబించుటయు నుకాదు. మనజాతి యింకను హద్దులేని ఈ యాధునిక రాజకీయ మంత్రాంగములలో శిక్షను పొందనిజాతి యనుసంగతి మరువరాదు. మన సైన్యమును, భటులను మాత్రమేగాక మన నాయకులును, ఉపనాయకులును, వ్యూహాది యుద్ధతంత్ర చతురులునుగూడ, విషయ శిక్షణమును, అనుభవ పరిజ్ఞానమును గనిగినగాని

మనకు బుద్ధిబలము కొరవడుటే కాక పరిపూర్ణాధ్యాత్మిక బలము కూడ కొరవడినది. మన యనుచరులును నాయకులును కూడ నెక్కువ గంభీరమైన సాధనను, మన యుద్యమ నాయకుడగు నా దివ్యగురులతో సాన్నిధ్య సామీప్యములను ప్రత్యక్ష సంయోగమును, ఆంతరంగికాభ్యుదయమును, తమ చేతలకును, చింతనములకును వెనుక నద్భుతమైన యోగపద్ధతులతో గూడిన శక్తిని కలిగియుండవలెను. నీతి బాహ్యమై, అపరిపక్వమైన పాశ్చాత్యోత్సాహ బలముచే మన మెన్నటికిని జయింపజాలమని యనుభవముల వెనుక యనుభవములు మనకు బోధించుచునేయున్నవి. ఓ భారతీయులారా! భారత యాధ్యాత్మికములే, భారతసాధనయే, భారతతపస్సే, భారతజ్ఞానమే, భారతశక్తియే మనలను స్వతంత్రులను, ఘనులను చేయగలవు. ఉత్కృష్టములైన మన ఈ తపోజ్ఞాన శక్తులను నీ శబ్దములకు శిక్షణ (Discipline) వేదాంతము (Philosophy) బలము (Strength) అను ఆంగ్లపదము లెంతమాత్రమును సరియైనవి కావు. శిక్షణ కంటె తపస్సు వేయిరెట్లు మిన్నయైనది. సృష్టి, స్థితి, లయస్వరూపమైన యాదివ్యశక్తిని యాధ్యాత్మికసాధనల ద్వారా మనలో మూర్తీభవింప జేసికొనుటే తపస్సు. అడవులకుపోవుట కాదు. జ్ఞానము, వేదాంతము (Philosophy)కంటె విశేషమైనది. అది మనపూర్వులచే దృష్టియని పిలువబడిన ఆధ్యాత్మిక దృష్టిచే జనించు ప్రత్యక్షదివ్యజ్ఞానము. శక్తి, బలము (Strength) కంటె

ఘనమైనది. అది గ్రహతారామండలమునుగూడ శాశిం పజాలిన మహాశ్రీరశక్తి యొక్క మూర్తిమంతము. భారతాభ్యుదయమునకు ప్రాచ్యవిజ్ఞానమే విజయ దాయిని. రాజకీయనాయకుని వెనుక యోగియో యుండ వలెను, లేదా అతడే యోగికావలెను. శివాజితో నేక శరీరుడుగా రామదాసు పుట్టవలెను. గారిబాల్డితో (ఇటలీనాయకుడు) మాజినీ కలియవలెను. బుక్కరాయ లుతో విద్యారణ్యులు వెలయవలెను. బుద్ధివైశద్య మున కాధ్యాత్మికతను, బలమునకు పవిత్రతను తోడు లేకుండ పాశ్చాత్యపరివర్తనమును మనము కొనసాగించవచ్చును, కాని పాశ్చాత్యబలముచే మనము జయించరాదు. అట్లు జయించ తలచుకొనరేదు.

19–వ శతాబ్దపు యుద్యమము లన్నియు కేవల బుద్ధిచే జనించినవగుటచేతను, వాటివెనుక సంస్కారిత హృదయము లేమిచేతను యవి విఫలమయ్యెను. ఆలో పమునుతీర్చుటకు జాతీయత పొటుపడెను. అది హృదయ ప్రబోధములను బుద్ధికిచేర్చి దానికి మరింత వేగమును, వివేకమును కలుగజేసెను. కాని దానిలోకూడ లోప ము కలదు. అది భావములోను, ఆశయములలోను, భారతీయమైనను ఆచరణలోను, సాధనములలోను పాశ్చాత్యమయ్యెను. దానికి బుద్ధిబలమే యెక్కుడయ్యె ను. కాని తగినంత ప్రబోధ పరిజ్ఞానబలము లేకపోయెను. అది యూహలకును ఆశయములకును లో నయ్యెను. కాని అంతకంటె గంభీరతత్త్వమును, ఈశ్వరేచ్ఛను

చూచుటకది సాధన చేసియుండలేదు. అది యవ్యాజమై, యుత్సాహపూరితమైన భావావేశముచే నడుపబడెను. కాని ఉద్రేకభావముకంటె నుత్కృష్టమై, నిర్దుష్టమైన యిచ్ఛాశక్తియు, దివ్యబలమును దానికి కొరవడియుండెను. కనుక జాతీయత పవిత్రస్నాన మాచరింపవలెను. అది యింకను మిన్నయైన పవిత్రసత్యమును గ్రహించవలెను. ఇంకను మిన్నయైన దివ్యభావములను వ్యక్తపర్చవలెను. లేదా అది సంపూర్ణముగా తన పూర్వ దేహమును విడిచి నూతన దేహమును ధరించవలెను. పరిస్థితులను గమనించుచో రెండవమార్గమే సూచింపబడుచున్నది. ఏమార్గమైనను జయమే నిశ్చయము.

గత పదునెనిమిది మాసములలోను(1919—20) జరిగిన పరిస్థితులండా జగద్గురుని యుద్ఘోషమిట్లు వినవచ్చుచున్నది. ''మీరు సమస్తసంపదలను బడయుటకు మీ సర్వస్వమును త్యజింపుడు. నాయిచ్ఛను నెరవేర్చుడు మిమ్ముమీరు తెలిసికొనుడు; పవిత్రులుకండు! మీ పిచ్చియూహల నిక విడనాడుడు'' చెవులున్నవారు దీని నాకర్ణింతురు గాక! ఆత్మసంయోగము లేనిదే జ్ఞానము కలుగజాలదు. అంతరంగమునుండి జ్యోతి బయలుదేరనిదే జ్ఞానము కలుగనేరదు. ఇది లేకుండ మనకు జయమును చేకూర్చు ఆచరణీయసాధన సంపత్తు కూడ దొరకజాలదు. సత్య ముద్యోతకమగువరకును కించిజ్జ్ఞానముతో చేయు పనులన్నియు విధాయికముగా

విఫలమగును.

దక్షిణేశ్వరములో ప్రారంభింపబడిన పనియింకను పూర్తికాలేదు. సరికదా దానినింకను మనము పూర్తిగా గ్రహించనేలేదు; వివేకానందుడు గ్రహించి సర్వవిధముల వృద్ధిచేయుటకు ప్రయత్నించిన పుష్పమింకను ఫలోన్ముఖమునకు రాలేదు. విజయగోస్వామి తనలో తానే దాగొనియున్నాడను భవిష్యత్సత్యమింకను అతని శిష్యులకే పూర్తిగా తెలియరాకున్నది. కాని ఒక వివేకజ్యోతి దానిని తయారుచేయును. మార్గమును కంటకవిచ్ఛిన్నము చేయును. తరువాత నంతకంటె మూర్తివంతమైన శక్తి యుద్భవించును. కాని యవి యెప్పుడు వచ్చునో, యెచ్చటకువచ్చునో యెవరికెఱుక!

ప్రబోధమును గాంచుచున్న భారతాత్మ, ఒకే రంగము నంటిపెట్టుకొనియుండు జాతీయప్రబోధముచే స్థిరముగను శక్తిమంతముగను నుండజాలదు. జాతీయాత్మప్రబోధమునొందినపుడే జాతి నిజముగా జీవించును. అప్పుడే తనలోనున్న విశాలమైన ఆత్మశక్తిని, ఆత్మానందమును వ్యక్తపరచుటకు మానవుడు చేయు సమస్తవివిధకర్మ కలాపములోను జీవితము స్ఫురించును. ఆనందముకొరకే ప్రపంచము సృష్టింపబడినది. ఆనందముకొరకే ఆత్మ ఈ యుత్కృష్టగంభీర జీవితకేళికి సమకట్టినది; తనను వివిధరూపములలో చూచి యానందించుచే యాత్మానందము. ఈకారణముచేతనే ఏయొక్కయిద్దరుగాని, రెండుజాతులుగాని ఒకేమాదిరిగ నుండు

టను మన మెక్కడను చూడజాలము. ప్రతిజాతియు మానవకోటికి చెందునట్టి సామాన్య మానవస్వభావము గాక ప్రత్యేక స్వభావముకూడ కలిగియున్నది. జాతి సామాన్య మానవస్వభావములతోను, కృత్యములతోను తృప్తిజెందక తన ప్రత్యేకశక్తులను, ప్రత్యేకవ్యక్తిత్వమును వృద్ధిచేసుకొనుటకే కోరుచుండును. ఆ యభివృద్ధియు, తత్పూర్తియు పొందలేనట్టి జాతి నశించును. కనుక మనమొక జాతీయోద్యమ పటుత్వమును రెండు పరీక్షలచే కనుగొనవచ్చును. ఆ యుద్యమ విధానము ఇతరుల ననుసరించి, అసహజముగా తెచ్చికొనినదైనచో దానికట్టి తాత్కాలికజయము చేకూరినను అట్టిజాతి, ఆత్మస్తంభనకును, ఆత్మ వినాశనమునకును మాత్రమే పోవుచుండును. కనుకనే ప్రాచీన పాశ్చాత్యజాతులు తమవ్యక్తిత్వమును రోమక నాగరికతకు, రోమక భాగ్యభోగ్యములకు, రోమక శాంతికి సమర్పించి నాశముచెందెను. అట్లుగాక జాతియొక్క ప్రత్యేకవ్యక్తిత్వమే యుద్యమముయొక్క ప్రతిభాగమున నుద్యోతకమగుచు, ప్రతినూతనాభివృద్ధిని ఆత్మప్రకటనకే సాధనగా చేసికొనినచో జాతి ప్రబోధమును గాంచి, జీవించి, యభివృద్ధిచెందును. అట్టిదాని రాజకీయ, సాంఘిక స్వరూపములలోను, సంస్థలలోను నెట్టి పరివర్తనములుగాని, మార్పులుగాని సంభవించినను నది చిరంజీవియై యభివృద్ధి గాంచుచునే యుండును. భారతదేశములో 19-వ శతాబ్దము అనుకరణ, ఆత్మ

విస్మృతి, విజాతీయము, అసహజములగు పద్ధతుల నవలంబించెను. అది, "బాగుగా నాచరించిన పరధర్మముకంటె ఓగుగా చేయబడిన స్వధర్మమే మేలు. పరధర్మము భయావహము. స్వధర్మములో చనిపోయినను శ్రేష్ఠమే!" అను గంభీర గీతావాక్యమును మరచి భారత దేశములో నొక యూరపును సృష్టించవలెనని చూచెను. స్వధర్మములో చనిపోవుటచే పునర్జన్మసిద్ధించును. పరధర్మములో జయము గాంచుట జయప్రదముగా నాత్మహత్యను గావించుకొనుటే. భారత దేశమున యూరపును సృష్టించుటలో మనము జయమును గాంచినచో మన యాధ్యాత్మిక శక్తిని, బుద్ధిపాటవమును, జాతీయసౌష్ఠవమును కోల్పోయి మరల తలయెత్తికొను శక్తినిగూడ పోగొట్టుకొనియుందుము. చరిత్రలో నిట్టి విషాదాంత నాటకము లెన్నిటినో చూచితిమి. వాటికి తోడు మరింత విచారకరమైన, మరింత యధమాధమ యుదాహరణము జతచేసి యుండెడివారము. జాతి యంతయు నిట్టియనుకరణను విజాతీయతను చేపట్టినచో నిట్టిఫలితమే సంభవించెడిది. కాని వంగ, పాంచాల దేశములలోని మత యుద్యమములలోను, మహారాష్ట్రుల రాజకీయాశయములలోను, వంగదేశసాహిత్య విజృంభనలోను జాతీయప్రాణ మింకను కొనయూపిరితోనుండెను. ఇక్కడకూడ నది యంతర్వాహినిగనే యుండెను. భారత ప్రత్యేక వ్యక్తిత్వము, భారతశక్తి తన యాత్మరక్షణకొరకు విదేశములతోను, విదేశ రూపములతోను పోరు

సలిపి చివరకందులో జాతీయధర్మమే యుత్తీర్ణత గాంచు వరకును భారతమోక్షము ధృవపడలేదు. హిందూమతములోని శ్రోత్రియత్వమే, అది తమోగుణ ప్రధానమైనను, జడమైనను, అజ్ఞానభూయిష్ఠమైనను సృజనశక్తి శూన్యమైనను, దేశములో జనించిన జాతీయభ్రష్టత మరింత హెచ్చు పెరగకుండ ఆపివేసి, నిరంతరము కృషిసలుపుచున్న జాతీయాత్మకు నావకాశమును, తగినంతకాలమును నొసంగి తన శక్తిని చేకూర్చుకొని విజయము గాంచుటకు తోడ్పడి దేశమును రక్షించెను. భారతాత్మ మొట్టమొదట మతములో ప్రబోధమును గాంచి జయమందెను. అట్టి భావిసూచనలు, మనకెప్పుడును కాన్పించుచునేయున్నవి ; కాని, ఏనాడు కలకత్తాలోని ఆంగ్లవిద్యాధురీణమకుటములు, అక్షరజ్ఞానశూన్యుడును, స్వయంజ్యోతి ప్రభాన్వితుడును, పరమహంసయు, విజాతీయభావముగాని విద్యగాని లేశమైనను లేనివాడును నగు హిందూసన్యాసి (రామకృష్ణపరమహంస) యొక్క పాదారవిందములకడ సాగిలబడిరో ఆనాడే యుద్ధము సమాప్తమై మనకు దిగ్విజయము చేకూరెను. ఈప్రపంచము నంతను తన రెండుచేతులలో నిమిడ్చుకొని, దానిని మార్చివేయుటకు విధినిర్మితమైన ధీరాత్ముడు, ‘‘నా గురువు’’అను మహావాక్యములతో బయలుదేరిన స్వామి వివేకానందుని యాత్రయే భారతదేశము తాను జీవించుటకే కాక జయించుటకుకూడ ప్రబోధమును గాంచెనని ప్రపంచమునకు జయజయ ధ్వానములతో ప్రథమ

బహిరంగ సూచననుగావించెను. తరువాత ప్రబోధము ప్రాప్తియగుటతోడనే, జాతీయోద్యమములో కొంతభాగము బ్రిటిషు ప్రభుత్వమునకు పూర్వముండిన పరిస్థితుల నన్నివివరములతోను పునస్సృష్టి చేసికొనవలెనని యూటలూరెను. ఇది స్వభత్వముకానేరదు. అభివృద్ధి గాంచుటకును, మార్పుచెందుటకును తిరస్కరించుటే తమస్సని మన వేదాంతము చెప్పుచున్నది. ఎక్కువ తమోవృద్ధి, భ్రష్టతకును నాశనమునకును కారణ మగుచున్నది. ఆత్మరక్షణకొరకు విజృంభణ యవసరము. ఒకశక్తి, జయించుచుండుటను మానివేసినచో తానే నశించును. ఏది పురోగమనము నభిలషించక నిలిచిపోవునో, ఆత్మరక్షణతతో మాత్రమే తృప్తిచెందియొదిగియుండునో యది పరాజయముపొందుట, అంతకంతకు తగ్గిపోవుట, చివరకు ప్రపంచచైతన్య వస్తువుల నుండి మాయమగుట తప్పదు. హిందూమత మెప్పుడును వెనుకకు మరలుచు, సమయముకొరకు పొంచియుండి ముందుకు పోవుచుండును. అది తన్నెదుర్కొనుశక్తిపై బడి, దాని స్థానముల నాక్రమించి, దాని సంపత్తు నంతను కొల్లగొని, దానిలోనున్న మనుజులనన్నిటిని తనవి చేసికొని, దానిని పూర్తిగా తనలో కలుపుకొనును; లేదా యది దేశములో నుండుట కెంతమాత్రమును ప్రయోజనము లేకుండచేసి, దాని యునికి నసంభవము చేసి, తరిమివేయును. అది వెనుకకుతగ్గి స్వరక్షణ చేసికొనునపుడు తనలోపలి సరిహద్దులలోనికిపోయి తాత్కా

లిక నాశనచిహ్నములను కలిగియుండును.

మతములో ప్రబోధమును గాంచినతోడనే జాతీయాత్మ, కాలముకొరకును అవకాశముకొరకును మాత్రమే వేచియుండి, జాతిలోనున్న తదితర ఆధ్యాత్మికాధిభౌతిక విషయము లన్నిటిలోను ప్రవేశించి, వాటిని కూడ తనవశము చేసికొనును. బంగాళావిభజనచే జనించిన యూరపుపైని ద్వేషమే, ఈ యవకాశము నొసంగెను. క్రోధము, ద్వేషము, తిరస్కారము వాటంతటచే యవి మంచిభావములుకావు; కాని భగవంతుడు వాటిని తన ప్రయోజనములకొరకు వినియోగించుకొని చెడుగు నుండి మంచిని ప్రసాదించును. అతి సోమరితనమును, ఉదాశీనతను పారదోలి శక్తిని, వీర్యవంతమైన భావావేశమును కలుగజేసెను; జాతీయాత్మ యీశక్తిని, భావావేశమును చేపట్టి తనభవిష్య దర్థముల కొరకు వినియోగించు కొనుచున్నది. యూరపియనులమీది క్రోధమును, వారివర్తక వ్యాపారముమీదను సీమసరకుల మీదను కలిగిన ద్వేషమును, వాటితో సంబంధమున్న ప్రతివిషయముపైనను కలిగిన యసూయయు, అంతయు నాంగ్లమయమైపోయిన తత్పూర్వపు భూతకాలముపై మహాప్రవాహవేగముతో విజృంభించెను. తత్పూర్వమే మన మతజీవితములో నాటుకొనియున్న యాత్మ యీ రహాధారీగుండ రాజకీయములలో ప్రవేశించి ప్రాచీనౌన్నత్య పునఃస్థాపనకొరకు దృఢమైన సంకల్పమును, యథార్థమైన భావి జాతీయతకొరకు అనంతా

మోఘప్రచండ సంకల్పమును కలుగజేసెను. భారతాత్మ యింకను రాజకీయ క్షేత్రమునంతను పూర్తిగా జయించ లేదు; కానిభావములోమాత్రమది యచ్చట జయభేరిని మోగించినది. తక్కిన దంతయు రోజులమీదనున్నది. ప్రస్తుత రాజకీయములలో జరుగుచున్న వ్యవహార మంతయు దీనిని యథార్థముగాను దృఢముగాను వ్యక్త పరచుటకే తోడ్పడుచున్నది. భవిష్యత్తు యిప్పటికి నిశ్చయమైనది. జాతీయాత్మను వ్యక్తీకరించుటకు ప్రధానమైన మతరాజకీయములు రెండును జాతీయతత్త్వముచే నిండినపుడు తక్కినదంతయు సకాలములోనే పరివర్తనము నొందును. మనమత, రాజకీయ జీవితముల యావశ్యకత లిప్పుడు పటుత్వ యథార్థశక్తు లగుచున్నవి; ఈ యావశ్యకతలే మనసంఘమును పునరుద్ధరించును; మనవర్తక, పారిశ్రామిక జీవితములను తిరుగసృష్టించి క్రొత్త పోతపోయును. ఇవియే జయావహమైన నూతన కళను, సాహిత్యమును, శాస్త్రమును వేదాంతమును సృష్టించుకొనును; కాని యివేవియును యూరపు వాసనకు లోనుగాక భారతీయములే యగును.

వంగదేశపు సాహిత్యములోను, కళలోను ఈ భావ మిదివరకే పనిచేయుచున్నది. జాతీయాత్మను రాజకీయములలో వ్యక్తపరచవలసిన యగత్యమే వంగదేశపుసాహిత్యమును తన ప్రధానమైన సనాతన తత్త్వమునకు తేగలిగి మన మొన్నటి జాతీయగీతములలో నీ యాత్మజ్ఞానము సూచించెను. చిన్న చిన్న గీతములు

అనగా స్పష్టమై నిర్దిష్టమై, అవ్యంగమై పటుత్వమైన గంభీరత, తీవ్ర సరళభావ వ్యక్తీకరణము ; ఉత్కృష్టమై, గూఢతలేని యుత్సాహము ; బల మాధుర్యములతోగూడిన "భక్తి" ప్రేమ రసము లుట్టిపడుట; ఆత్మవిజ్ఞాన హృదయముచే ప్రజ్వలించు బుద్ధిబలము ; భావములను ఆధ్యాత్మికదృష్టిని, అచింత్య-అపూర్వస్థితిలోనికి తీసికొనిపోయి వానిని స్పష్టముగా వ్యక్తీకరించుట, ఇదియే వంగదేశపుఆత్మ. మనసాహిత్యమంతయు, నది పూర్తిగా జీవించియుండవలెనన్న, ఈ పునాది మీదనే బయలుదేరి, యెన్నిమార్పులు చెందినను దీనితో సంబంధమునుమాత్రమది కలిగియుండవలెను. వంగదేశమున కళలోకూడ జాతీయాత్మ తన యాత్మానందమును చూరగొని మొగలుపరిపాలన మంతరించిన తరువాత మొదటిసారి అబనీంద్రనాథటాగూరిగారి యధ్యాపకత్వమున నూతనజాతీయ కళ యారంభమయ్యెను. అది తన యధ్యాపకుడు నాధారముగా తీసికొనిన విజాతీయాధికారముచే నింకను బాధపడుచున్నది. అది యింకను కొంచముదిగుమతి వాసన వేయుచున్నది. కాని అప్పుడే యీ తాత్కాలికాధికారము నుండి యభివృద్ధియు, జాతీయాత్మయొక్క ఆత్మమోక్షమును పొడగట్టుచున్నవి. ఇక్కడకూడ వంగదేశపు ఆత్మయే వ్యక్తపడుచున్నది. నిరాకార నిరవధికమైన దానిని, సాకార, సావధికముగా వ్యక్తముచేయుటకు ప్రయత్నించుటే భారతకళయొక్క ప్రయత్నము. గ్రీకు

లింతకంటె సులభసాధ్యమైన, స్వల్పపరమావధికే ప్రయత్నించుటచే యెక్కువ సంపూర్ణజయమును గాంచగలిగిరి. మనకంటె వారికి భౌతికరూపమునందభినివేశము మెండు; వారికంటె మనకు మానసిక రూపమునందును, వర్ణమునందును యభినివేశము మెండు. ఆత్మను వ్యక్తము చేయు పరిపూర్ణరూపమును, వర్ణమును జయప్రదముగా సంయోగము చేయుచు, మన భారతదేశము యొక్క ఉత్కృష్టలక్ష్యమైన శరీరములో నాత్మను వ్యక్తీకరించు సమస్యనే మన భవిష్యత్కాళ పూర్తిచేయ వలసియున్నది. వంగదేశీయునకు రూపమునందున్నంత బలమైన యభినివేశము మరేభారతీయునిలోను లేదు. భారతజాతులలో సహజముగానున్న వేదాంతమునకు తోడు అతడు సౌకుమార్యమునకును, సౌందర్యమునకును, బలమునకును యపరిమితాభిలాషను కలిగియుండును. కనుకనే నూతనముగా బెంగాలులో తలయెత్తిన కళ మొట్టమొదట సహజముగా నీగుణములనే స్వీకరించెను. ప్రాచీనభారతకళయందు, శిథిలమైపోగా మిగిలిన అస్థిపంజరములో నెచ్చటను పరిపూర్ణస్వరూపము దొరకకపోవుటచే నది సౌకుమార్య, సౌందర్యములో విజయము గాంచిన జపాను వైపునకు తిరిగెను. కాని శరీరములోని గంభీరమైన ఆత్మను వ్యక్తీకరించు రహస్యము జపానుకు తెలియదు. దానికా లక్ష్యము లేదు. వంగదేశపు ఆత్మ, సౌకుమార్య, సౌందర్య, బల సంయోగముల కతీతమైనది. దానిలో 'నచింత్య, అవికార' భావము కలదు.

అది అకళంకము, మూర్తిమంతము. మన సాహిత్యములో వలెనే మన కళలలోకూడ రూపురేఖలకు వన్నెదెచ్చు సౌందర్యభావమును, ఇదమిద్ధమని నిర్వచించజాలని యాధ్యాత్మిక మాధుర్యములును విజృంభించగలవు. ఇచ్చటను జాతీయాత్మ విజాతీయ శృంఖలములనుండియు, పరిమితులనుండియు విమోచకప్రారంభమునే సూచించుచున్నది.

ఈ పునరుద్ధారణ, ఈ పునర్నిర్మాణము మన వివిధజీవితశాఖ లన్నిటిలోను కూడ జరుగును. మన సంఘమంతయు, సంపూర్ణ పునర్నిర్మాణమును, పరివర్తనమును, గాంచుననుటలో నెట్టి సందేహమును లేదు. కాని యాపరివర్తనము మన సామాన్య సంస్కర్తలు గ్రుడ్డిగా యాశించి యూరపును భారతదేశములో సృష్టించుటగాక, సంఘము జాతీయాత్మను మరింత యెక్కువపరిపూర్ణముగా నవగతముచేసికొనుటకే జరుగును. వ్యక్తిస్వార్థము, ఒకరినొకరు దిగమ్రింగునట్టి పోరాటముకాక, వ్యక్తులనందరి నొకేయభేద్యమగు జీవితముచే బంధించుశే జాతీయాశయము. ఈ భావనమే భూతకాలములో రక్తబంధముచే సమిష్టి కుటుంబములోను, ఒకమాదిరి సాంఘిక తత్త్వబంధముచే గ్రామపాలనలోను, జన్మబంధముచేతను కులములోని సమష్టి గౌరవ ప్రవృత్తుల ఎడల బాధ్యతచేతను కులములోను వ్యక్తీకరింపబడెను. అది భవిష్యత్తులోకూడ నింతకంటెను పరిపూర్ణమైన యాధ్యాత్మిక బంధము నేర్పర

చుకొనవచ్చును. వర్తకములోకూడ నొకరితోనొకరు పోటీచేయు స్వార్థపరత్వము, జాయింటు స్టాకుకంపెనీల లోని కేవల ప్రయోజన బంధము, ధనాఢ్యుల పరపతి సంఘముల యథనూాధమ యుపద్రవకర స్వరూపమైన ట్రిస్టు సిండికేటు పద్ధతులు మొదలగు యూరపియను తత్త్వముచేతను, యూరపియను పద్ధతులచేతను, మన మెన్నటికిని యారోగ్యభూయిష్ఠమైన పారిశ్రామిక జీవిత మును నిర్మించజాలము. భారతీయుల నైక్యముచేయున వీబంధములుకావు. ప్రపంచ మిప్పటికిని సాధ్యములగు నని యూహించజాలనట్టి ఉత్కృష్ట, గంభీరజీవితము కొరకే భారతదేశము సంకల్పించినది; కదలుచున్నది. అది తన యాత్మ నికృష్టములలోకూడ వ్యక్తీకరించుకొను రహస్యమును కనుగొనినపుడే యామె పారిశ్రామిక, సాంఘికజీవితము బలవత్తరమై విస్తృతిని చెందగలదు.

మనము యూరపియను జాతులము కాకుండ జరిగిన తిరుగుబాటే యిదివరలో చాలవరకు మన కబ్బిన జాతీయత; కాని అది భారతీయమైన ప్రతిదానిని చిన్నచిన్న వివరములలోగూడ నంటిపెట్టుకొని యుండ కూడదు. దురభిమానమునుండి తన్నును కాపాడుకొన వలెను. హిందూమతముయొక్క తత్త్వము భూతకాల ములో నష్టముండలేదు; ఇక ముందుకూడ నష్ట మేల జరుగకూడదో తెలియరాదు! జీవిత మంతటిలోను చలించని, శాశ్వతమైనది, తత్త్వము; వృద్ధిచెందుచు శాశ్వతముగా నుండునట్టిది,యాత్మ; పెలుసుదనముగలిగి

మార్పునొందుచుండునట్టిది శరీరము; ఇట్లని మూడు ప్రధాన వస్తువు లున్నవి. తత్త్వమును మనము మార్పునొందించ జాలము; మనము దానిని మఱుగుపరచవచ్చును, లేదా పోగొట్టుకొనవచ్చును; ఆత్మయెడల దురుసుతనముతో ప్రవర్తించరాదు; దానికి విజాతీయమైన రూపమును కల్పించి దానిని బాధించరాదు. దాని స్వైరాభివృద్ధి కాటంకమును కలుగజేయరాదు; శరీరమును మన మొక సాధనముగా నుపయోగించవలెను. అదే యమూల్యమైన వస్తువని ముఱిపెములను చూపరాదు. అన్యాయమైన మార్పుకొరకు మన ప్రాచీనసాంప్రదాయములను, రూపములను మన మెన్నటికిని త్యజించజాలము. జాతీయ తత్త్వము చావులేని మన జాతీయాత్మను మరింత యదార్థమైనదానిచేతను, శ్రేష్ఠమైనదానిచేతను వ్యక్తీకరింప గోరునేని మన మెంతటి ప్రాచీనతనైనను పట్టుకొని వ్రేలాడజాలము.

# త్యాగ సూత్రము

ఆత్మార్పణ మొనర్చుట, అన్నిజాతులకు గాని, అందఱు వ్యక్తులకుగాని సామాన్యమైనది కాదు; అది మిక్కిలి అరుదైనది; అమూల్యమైనది. అది మానవుని నైతికాభివృద్ధి జన్యమైన మకుటము; అది స్వార్థపరత్వముతో గూడిన జంతుస్వభావమునుండి స్వార్థరహితమైన దివ్యత్వాభివృద్ధిసూచకము. ఆత్మార్పణమును చేయగల మానవుడు, వానిలోనున్న యితరదోషము లేవియైనను, జంతుస్వభావము నతిక్రమించినవాడే యగును. వానిలో భవిష్యత్తునకును, ఉత్కృష్ట మానవత్వమునకును పనికి వచ్చు దిట్టతనము శక్తి యున్నవి. జాతియంతయు నాత్మార్పణము చేయగలనాడు తన భవిష్యత్తును ధృవ పరచుకొనును.

కాని మన ఉనికికి సాధారణముగా అనైచ్ఛికమైన లేక స్వార్థపరత్వముచే కప్పబడిన ఆత్మార్పణమే కారణ మగుచున్నది. మానవలోకములో నది క్రమాభివృద్ధిని గాంచెను. మొట్టమొదట త్యాగము లన్నియు స్వార్థపరములుగనే యుండును. అవి యాత్మాభివృద్ధి

కొఱకితరమును త్యజించుచుండును. అభివృద్ధికి మొదటి సూచన,బిడ్డకొరకాత్మార్పణచేయు తల్లియొక్క జంతు ప్రేమలోను, పురుషునిలోనున్న రక్షణస్వభావముచే తన స్త్రీకొరకుచేయు ఆత్మార్పణలోను కాన్పించును. ఈస్వభావ మభివృద్ధియగుచే ఆత్మభావాభివృద్ధిని తెలియ జేయును. తన శరీరముతోను, దాని కోరికలతోను మాత్రమే ఆత్మైక్యముచేసినవాని "జీవము" యొక్క స్థితి పశుప్రాయమును,అభివృద్ధిరహితమును అగుచున్నది. భార్యా బిడ్డలనుకూడ తనలో నైక్యము చేసికొనుట కాత్మ విశాలమైనపుడే యభివృద్ధి సంభవ మగుచున్నది. ఇదియేః ప్రథమ మానవస్థితి. కాని యిచ్చటకూడ భార్యాబిడ్డలను మన స్వసౌఖ్యము కొరకును, బలము కొరకును, ఘనతకొరకును, భోగముకొఱకును నియమింప బడిన సొత్తువలెను, పశ్వాది వాహనమువలెను చూచు నంతవరకు పశుత్వమే యుండును. అట్లుచూడబడినను, సాంఘికజీవిత మిచ్చట సాధ్య మగుచున్నది. గనుక, కుటుంబము నాగరికతకు పునాది యగుచున్నది. కాని దేహములోనున్న ప్రాణముకంటెనుకూడ కుటుంబము ప్రియతరమై దానికొరకు నానపుడాత్మార్పణ మొనర్చి దానిసౌఖ్యముకొరకుకాని, రక్షణకొరకుకాని తనసౌఖ్యమును, తనప్రాణమునుకూడ యర్పించుటకు సంసిద్ధుడైన గాని యతనిలోని భగవంతుడు యథార్థాభివృద్ధిని గాంచజాలడు. కుటుంబముకొరకు స్వసౌఖ్యమును వీడు వారు చాలమందికలరు. గృహరక్షణకొరకుగాని,భార్య

ఘానరక్షణకొరకుగాని తన ప్రాణముల నిచ్చివేయుట యుత్కృష్టస్వభావ లక్షణము. ఈశక్తి కొందరువ్యక్తు లకు కొన్నితరగతులకు మాత్రమే కలదుకాని సమష్టి మీఁదలేదు. కుటుంబము తరువాత సంఘము కలదు. దేహములోనిఆత్మ కుటుంబములోని ఆత్మనుదాటి సం ఘములోని ఆత్మతో నైక్యముపొందుట యభివృద్ధికి తరువాతమెట్టు. తన కుటుంబముకంటె తనసంఘమునకే తనమీఁద యెక్కువ యధికారమున్నదను సంగతి గ్ర హించుటే సాంఘికస్థితి కభివృద్ధిసూచన. కుటుంబము నుంచి పరిణామముచెందిన జాతియు, పరిపూర్ణత నొం దిన సాంఘికసంస్థలును (మన గ్రామసంఘములు మాదిరివి) ఈ యభివృద్ధినే సూచించును. ఇక్కడ కూడ కుటుంబ ప్రయోజనముల నంతకంటె యెక్కుడైన సాం ఘిక ప్రయోజనముల కొరకు ధారపోయుట కెల్లప్పుడును సంసిద్ధతను చూపుటే సాంఘికస్థితికి మొదటిసూచన. సంఘరక్షణకొరకు తనజీవితమునే యర్పించుట దేవ తార్హమైన కార్యము; సాంఘికస్థితిలో పరిపక్వము నొంది యభివృద్ధిజెందుచున్న ఆత్మస్థితినే యిది సూచిం చును. తరువాత ఆత్మ జాతీయస్థితిలో నభివృద్ధి గాంచ వలెను. ఈజాతీయ పరిణామ మిప్పుడు మానవలోక మున కత్యావశ్యకమై యున్నది. మానవలోకములో భగవంతు డభివృద్ధిగాంచవలెనన్న భూతకాలమున మన లో పాతుకొనియున్న మానవస్వార్థములు, వర్గస్వార్థ ములు (Class selfishness) తమంతటవి అంతకంటె విశాల

మైన జాతీయస్వార్థములో లీనముగావలెను. కనుకనే జాతీయతయే యిప్పటి యుగధర్మము; భగవంతుడు మన మాతృదేశ రూపమున మనకుదర్శన మొసంగును. యవనుల పట్టణములు, మంగోలియనుల యొక్క ప్రభు పరిపాలన, కెల్టుల వంశము (Clan) ఆర్యుల కులము లేక జాతి ఇవియే జాతీయతను సృష్టించుకొనుటకు చేయ బడిన ప్రథమ ప్రయత్నములు. ఈపైయన్ని యభిప్రాయముల సమ్మేళనమునుంచి మధ్యయుగపు జాతి సృష్టింప బడెను. ఈ యాధునిక ప్రత్యేకదేశ ప్రజలందరును దాని పరిణామమే! ఇక్కడకూడ తన స్వార్థమును, కుటుంబస్వార్థమును, వర్గముల (Class) స్వార్థమును అంతకంటె విశాలమైన జాతీయ స్వార్థముకొరకు త్యాగము చేయుటకు సంసిద్ధతను జూపుటయే మానవలోకము జాతీయస్థితిలో నుండుటకు ప్రథమసూచన. దాని మంచికొరకు, దాని రక్షణకొరకు చనిపోవుట విశాల జాతీయాత్మస్థితిలోని పరిపక్వతను సూచించును. వీటన్నిటి కంటెను కూడ మహోత్కృష్టమైన స్థితి మరియొకటి కలదు. దీనికి కొద్దిమంది వ్యక్తులుమాత్రమే తమ సంసిద్ధతను చూపగలిగిరి. అక్కడ ఆత్మ మానవలోకము నంతనుకూడ తనలో నిముడ్చుకొనును. మానవలోకము నంతను యుద్ధరింప సమకట్టు యాశయములతో కొద్ది మంది మాత్రమే తా మాహుతులై ఈ యభివృద్ధి మార్గమునుబట్టిరి. జాతీయతయొక్క స్వప్రయోజనముల కంటె యుత్కృష్టమైన మానవలోక ప్రయోజనకొరకు

త్యాగముచేయుటకింకను ప్రజలు సమష్టిమీద సంసిద్ధులు కాలేదు. భగవంతుడుదానిని తయారుచేయును. కాని కాలము రాకుండగనే, ఆకాలములోనే ఫలమును పక్వముచేయుట కాతడెన్నడును పూనుకొనడు. ఇదికూడ సంభవమగు కాలమాసన్నముకాగలదు, అది యింకను రాలేదు. కాని తక్కిన తక్కువ అవస్థలన్నిటితోడను ఐక్యపూర్తి నొందకపూర్వమే ఇది వచ్చినను మానవలోకమునకు లాభములేదు. అట్లుచేయుచో పూర్తి కాకుండ విడిచిపెట్టబడిన యవసరముకొరకు తిరిగి వెనుకకు పోవుటచే తటస్థించును. మానవవికాసాభివృద్ధి క్రమముగాను నెమ్మదిగాను యుండును. ప్రధానమైన అంశములను జయించకుండ వెనుకవిడిచిపెట్టి, ముందుకు దుడుకుగా పరుగెత్తుట లాభకారికాజాలదు.

జాతీయాత్మయనగా సమష్టిస్వార్థముకన్న వేరు కాకపోవచ్చును. జాతియొక్క ఔన్నత్యము మీదను, మంచిస్థితిమీదను ఆధారపడియుండు నాభాగ్యమును, కీర్తిని, గొప్పపదవిని, ఆస్తిని కోరియే నేను ధనమును, సౌఖ్యమును త్యజించవచ్చును. నా గృహముయొక్కయు నాపొట్టయొక్కయు రక్షణ దాని రక్షణమీదనే యాధారపడియుండుటచే, నే నింతకన్నను యెక్కుడు త్యాగములనే దానికొరకు చేయవచ్చును. దానిఉత్కృష్టత, భాగ్యము, సౌఖ్యము నాసంఘముయొక్కయు లేక నా తరగతియొక్కయు ఉత్కృష్టత, భాగ్యము, సౌఖ్యములే యగును గనుక నే నింతకన్నను యెక్కుడు

త్యాగమునే చేయవచ్చును. లేక నాజాతియందు నా కున్న గర్వముచేతను, అది ప్రపంచమునంతను పాలించుచు, సామ్రాజ్యము నొందుటను చూడవలెననెడు కోరికచేతను నా సర్వస్వమును ఆమె యౌన్నత్యము కొరకు ధారపోయవచ్చును. ఇవన్నియు మానవుని, తన స్వార్థమునుండి రక్షించుటకు సహాయపడు విశాల జీవితమునకు గొంపోవు స్వార్థస్వరూపములే యగుచున్నవి. ఆధునిక జాతులను పీడించుచున్న సామ్రాజ్య, ధనతత్త్వ పిశాచముల కీచివర స్వభావమే కారణము. ఈగర్వమునకును, దురహంకార దురభిమానమునకును, అన్యాయమునకును యేదిమూలమో అదియే జాతియొక్క యౌన్నత్యము నొక్కసారి గుభాలున క్రిందకు కూలద్రోయును. ఈగర్వ మౌన్నత్యమునుండి పొగరుపోతుతనమునకును, దౌర్బల్యమునకును దారిపెట్టును. వాటినుండి జాతులను, ప్రజలను భస్మీభూతముచేయు, భగవదస్త్రమైన, కంఠ్లుకాన రానట్టి మతిభ్రమణకలిగి నటరాజసందర్శన మగును. దీనికొక్కటే తరుణోపాయము కలదు. ఈసామాన్య మానవకోటిలో జాతి, ఒక్క అవసరమైన భాగముమాత్రమే! అంతకంటె వేరుకాదు. దానికంతకంటె వేరు ఆధిక్యత లేదు అనుసంగతిని గ్రహించవలెను. జాతియొక్క జీవితములో రెండంతరువులున్నవి. మొదటిది జాతి తన స్వరూపమును నిర్మించుకొనుట; లేక క్రొత్తగా తిరిగి నిర్మించుకొనుట; రెండవది దాని నిర్మాణము జరిగి అది దిట్టతను చేకూర్చుకొని శక్తిమంత

ప్రతికార్యము త్యాగమును బాధను కోరుచున్నది. స్వదేశీవ్రతము, పంచాయితీలు, జాతీయవిద్య, సాత్త్విక నిరోధము, ఇవన్నియు నట్టివే. వ్యక్తులును, కుటుంబములును జాతీయత కొరకై యాహుతి యగుటకు సంసిద్ధతను జూపినగాని యివేవియును చేకూరజాలవు. ఈరోజులలో మఱియొక పిలుపుకూడ వినవచ్చుచున్నది. పై తరగతుల వారు తమ యధికారములను, ద్వేషములను క్రింద తరగతుల నుద్ధరించుటకు త్యాగము చేయవలెను. భారత జాతిని సృష్టించుకొనుటకు పూర్వము, అందరిలోను నిరాఘాటమైన త్యాగాగ్ని ప్రజ్వరిల్లవలెను. మన యుద్యమముయొక్క స్వభావముమాత్రమేగాక, అనుభవ చరిత్రలుకూడ నీ సత్యమును చాటుచున్నవి. జాతీయ వాదులు ప్రబోధమును గలుగజేయు ఆశయముల చేతను, బాధల ననుభవించుటకు చూపిన సంసిద్ధతచేతను జాతీయహృదయమును తమతో కూడగట్టుకొనిన ట్లె చరిత్రచేతను, అనుభవముచేతను వివేకవంతులనుకూడ యొప్పించిరి. ప్రతివ్యక్తి విషయములోను మన మీ త్యాగసమస్య నంతను తర్కించుచుండవలెననుట యనవసరము, అసంభవము. త్యాగముయొక్క ప్రయోజనమును, అవసరమును మనము గ్రహించి యీ పిలుపును వ్యక్తిగతముగా నాచరణకు తేవలెను. స్వరూప నిర్మాణమును సాధించియు, స్వాతంత్రత ననుభవించుచు, ఔన్నత్యదశలో నున్న ప్రజాపరిస్థితులను, పరాధీనతలో నుండి దారిద్ర్యభూయిష్ఠమై పోరు సలుపుచున్న ప్రజాస్థితు

లతో మనముపోల్చరాదు. మొదటి పరిస్థితులలో మానవప్రకృతి తరుచుగా స్వార్థార్పణ చేయనవసరములేదు. జాతి సక్రమముగా కోరునట్టిచోట్లను జాతి కవసరమైనపుడు ప్రత్యేకముగా చేయవలసిన త్యాగమునకును సాధారణ సంసిద్ధతను చూపిన చాలును. కాని రెండవపరిస్థితులలో త్యాగ మెప్పుడును తరుచుగా యవసరమే యగుచుండును. అట్టి పరిస్థితులలో వ్యక్తులుచేయు ప్రతి త్యాగమునకును, ప్రతి ప్రత్యేకధైర్య సాహస ప్రదర్శనములకును సరియైన విలువ కావలయునని కోరుటలో న్యాయమేమియును లేదు. పరాధీనతలోనున్న వ్యక్తులు తమ స్వాతంత్ర్య సంపాదనకొరకు చెల్లించవలసిన సుంకము నీయవలసివచ్చినపుడు కర్మఫలదాతయైన యా పరాత్పరునితో "మేము చేయు ప్రతి త్యాగమునకును నీ వింత ప్రతిఫలము నీయవలెను. మాకు నీవిచ్చు ప్రతిఫల మేదియో ముందుగా తెలియజేయవలెను మా బాధలకొక్క చిల్లిగవ్వయెత్తు ఫలితముకైనను మేము నిన్ను నమ్మజాలము." అని బదులు చెప్పుట కడు శోచనీయము, హాస్యాస్పదము. అట్టి మనుష్యులచేతగాని, అట్టి తత్వముచేతగాని పరాధీనదేశము ఎన్నడును తన మోక్షమును సాధించియుండలేదు.

# పరిణామ విధానము

పరిణామములో నొకస్థితియొక్క సమాప్త్యవస్థ వచ్చినపుడా పరిణామమునుండి తొలగిపోవలసిన వస్తువు దేదీప్యమానముగా వెలుగుచుండుటను మనమునాచు చుందుము. ప్రకృతిసూత్ర మేమన మానవలోకములో వ్యక్తులలోను, సమష్టిలోను, బలవత్తరమైన స్వభావ ముగాని, లోతుగా నాటుకొనియున్న యాచారముగాని పోవలెనన్న నది మొట్టమొదట భోగముచే నలసిపోవలె ను. తరువాత నిగ్రహముయొక్క బలముచే నిర్వీర్యము చేయబడవలెను. చివరకు దుర్బలమై అంత్యావస్థలో నున్నపుడు సంయమముచే త్రోసివేయబడవలెను. నిగ్ర హమునకు సంయమమునకును యున్న భేదమేమన, మొ దటి పద్ధతిలో నా స్వభావముయొక్క యథార్థబలము తో పనిలేకుండ దాని నణచివేయుటకును, నలిపివేయు టకును, సాధ్యమగుచో హత మొనర్చుటకును బలవత్తర మైన ముష్టాముష్టి జరుగును. కాని రెండవపద్ధతిలో నదియొక మృతశక్తి లేక మృతించుచున్నశక్తి యగుచున్న ది. అది మధ్యమధ్య తలయెత్తునపుడు మొదట విసుగు,

తదువాత ఓర్చుకొన లేకపోవుట ; చిట్టచివరకు ఒకప్పుడు శక్తిమంతమై యథార్థమైన దివుడు శూన్యమై మృతకళే బర మగుటచే దానిని నిర్లక్ష్యముచేసి నశింపుజేయుట జరుగును. అవాంఛనీయమైనదియు, నశింపుకావలసినది యు,నీవిధముగా విజృంభించుచుండుట, దానిని త్రోసి వే యుటకు ప్రకృతి కల్పించుకొను విధానములలో నొకటి. అదిపోవునపుడు కోపము పెద్దదియగుటలేదా.

ఒకశక్తి, ఒకగుణము లేక ఒకస్వభావ మింకను శైశవావస్థలో గాని, పటుత్వములో గాని యుండగా దాని వంతు వచ్చుభోగము పూర్తికాకమునుపే సంయమము చేయుట అకాలమును, నిష్ఫలమును నగును. ఒక వస్తువు పుట్టుటతోడనే దానికి పోషణము, వృద్ధి, భోగము, జీవితము, చివరకు మృత్యువు, నాశనము ఇన్ని కలుగ వలెను. ప్రకృతి తనసృష్టికి కొంతశక్తినిచ్చినపుడది యాగి పోవుటకు పూర్వము దానంతటదియే సహజమైన యలస టచే నంత మొందవలెనని దాని యుద్దేశము. వృద్ధిని, వేగమును బలవంతముగా, దాని కాలములో దాని నాపి వేయజూచుట నిగ్రహము. ఇది కొంతకాలముమాత్రమే నిలుచునుగాని శాశ్వతముగా జయించజాలదు. అన్ని వస్తువులును తమతమ స్వభావములచేతనే పాలింపబడు చు, తమ స్వభావముల వైపునకే మరలుచుండును. నిగ్రహము నిష్ఫలము ; అని గీతలో చెప్పబడియున్నది. అప్పుడుజరుగున దమన, అకాలములో దౌర్జన్యముచే చంపబడినవస్తువు నిజముగా చనిపోనేరదు; అది కొంత

కాలము దానిని పెంపిన ప్రకృతిలోనే యణగియుండి మహత్తరమైన బలమును సంపాదించుకొని తిరస్కరింపబడి, తనకు హక్కుగల భోగము కొరకద్భుతమైన వేగముతో తిరుగబడును. మనము మొట్టమొదటసారి యోగమార్గము నవలంబించినపుడు మనదుష్ట సంస్కారములను పోగొట్టుకొనుటకు చేయు ప్రయత్నములలో మనకిదే యనుభవము కాగలదు. మన స్వభావములలో క్రోధము ప్రధానమైనయెడల మనము దానిని కొంత కాలము బలవంతముగా నణచిపెట్టి దానిని సంయమమనవచ్చును; కాని చివరకు శాంతిచెందనట్టి ప్రకృతి, మనలను జయించి, యూరాగ మాకస్మికముగా నద్భుతమైన శక్తితో యెప్పుడో మనపై తిరుగబడును మనలను బానిసలనుచేయు రాగములను జయించుటకు రెండే మార్గము లున్నవి. మొదటిది అది తలయెత్తినపుడెల్ల దానికి వ్యతిరేకమైనరాగముచే దానిని లేకుండ చేసికొనుట; క్రోధమును క్షమచేతను, ప్రేమ లేక ఓర్పుచేతను; లోభమును పవిత్రతను ధ్యానించుకొనుటచేతను, గర్వమును మన మల్పులమను జ్ఞానముచేతను, మన దోషములను లేక శూన్యతను తలపోసికొనుట చేతను; ఇది రాజయోగమార్గము, కాని యిది చాల కష్టమైనది, మెల్లనైనది, అనిశ్చయమైనది. ఏలన మన ప్రాచీన సాంప్రదాయములును, మన ఆధునికుల యోగానుభవమునుకూడ, యనేకసంవత్సరము లుత్కృష్టమైన యాత్మ నిగ్రహమును గలిగియున్నవాడుకూడ

తమచే చంపబడినదని కాని, శాశ్వతముగా నణచివేయ
బడిన దనుకొన్నగాని విషయము ఆకస్మికముగ మరింత
వేగముతో తిరుగబడుటనే చూపుచున్నవి. అయినను,
యెంత నెమ్మది మార్గమైనను, యీమార్గము ప్రకృతిలో
సర్వసామాన్యమైన పద్ధతులలో నొకటి. ఎక్కువగా
యీమార్గమును తెలియకుండకాని, కొంతకొంత తెలిసి
గాని, ననుసరించుటచేతనే మానవుడు మారుచు, జీవిత
జీవితమునకును గాని, యొకజీవితములోనేగాని యభివృద్ధి
ని గాంచుచున్నాడు. ఇది విషయములను విత్తులోనే
చంపివేయుట లేదు. యోగముచేత కాని భస్మము
చేయబడజాలని యీ విత్తు, మొలకెత్తి సంపూర్ణ
మైన మహావృక్ష మగుటకు కూడ, నెప్పుడును
శక్తిమంతముగానే యుండును. రెండవ పద్ధతి ఆరాగ
మునకు భోగము నిచ్చి దానిని త్వరగా సాగనంపుట.
ఎక్కువభోగముచే తృప్తిపొంది, తేన్పులు వచ్చినపు
డది యలసిపోయి దుర్బలమగును. అట్టి సమయముల
లో ప్రతీకారము జరిగి దానికి వ్యతిరేకమైన మరియొక
భావము లేక స్వభావము కొంతకాలము ప్రజ్వరిల్లును.
ఆసమయమును యోగిచేపట్టి నిగ్రహముచేసినచో, నట్లు
సమయము చిక్కినపుడెల్ల చేయుచుండు నిగ్రహ
మతిసమృద్ధమైన యా "వృత్తి" యొక్క బలమును, పటుత్వ
మును నిర్వీర్యముచేసి చివర సంయమము నుపయో
గించుటకు తయారుచేయును. ఈవిధముగా భోగమును,
పతీకారమును జరుగుచుండుటకూడ ప్రకృతిలో సర్వ

సామాన్యమైన మార్గమే; కాని యిది దానంతటది పేరు పరిపూర్ణమైన పద్ధతి కాదు. దీనిని మనము మనలో శాశ్వతముగా నుండు శక్తులపైగాని, స్వభావములపై గాని ప్రయోగించితిమేని వ్యతిరేకభావము ఉత్పన్నమగుచు ఒకవిధమైన యేతాము తయారగును. ఇట్టి స్థితి ప్రకృతికి తన వ్యవహారముల కెంతయో ప్రయోజనకారియైనను, ఆత్మసంయమము విషయమై నిష్ప్రయోజనమును, అర్థకృషియు. ఈ క్రిందిపద్ధతిన సంయమమును అనుసరించుచుండునపుడే యది ఫలప్రదమగును. "వృత్తి" ప్రకృతిలీల యనియు దానితో తన కేమియు సంబంధము లేదనియు, తానొక సాక్షిమాత్రమే యనియు యోగి గ్రహించును. కామ, క్రోధ, లోభములు తనవి కావు; అవి యావిశ్వ'మాత'వి; ఆమె వాటిని తన స్వప్రయోజనముల కొరకే ఉపయోగించుకొనుచు "స్వస్తి" చెప్పుకొనుచుండును. కాని "వృత్తి" బలవత్తరముగానుండి దానిదే పైచేయియై నిర్వీర్యము కాకుండ నున్నపుడిట్టి భావముతో మనము సరిపెట్టుకొనకూడదు. పైన చెప్పబడిన యోగదృష్టి లేకుండ యిట్టిభావములను బుద్ధిచే సమర్థించుకొనుచు కూర్చుండుట మిథ్యాచారము; బూటకము; అసత్యశిక్షణ. అనేక పర్యాయములు భోగముచేతను, హఠముచేతను కొంత యలసిపోయిన తరువాతనే ప్రకృతి "పురుషు"ని యాజ్ఞననుసరించి, తను సృష్టించుకొనినదాని నుపసంహరించుకొన ప్రయత్నించును. మొట్టమొదట నది వైరాగ్యమును మోటు

రూపమైన విసుగుతో ప్రారంభించును. దీనిలో కూడ రాజస్యముండుటచే నది శాశ్వతముగా నుండజాలదు. అయినను యీ విసుగు, దీనికి కారణమైనదానిని నిర్మూలించవలెనను గాఢమైనకోరికను వెనుక విడచిపెట్టును. ఆ రాగము తిరుగబడి కొంతకాలము తన పరిపాలనను సాగించినతరువాతకూడ నీకోరిక యట్లేయుండును; తరువాత నిది దానిరాకకు, ఓర్పును వహించజాలకయుండును. దాని హానిపై దృఢమైన యసహన మింకను కలుగదు. చివరకు దానిపై సంపూర్ణమైన యుదాసీనత కలిగి ప్రకృతియొక్క యీ సామాన్య విధానముచే రాగము నశించుటను యోగి యథార్థమైన సంయమ దృష్టితో తిలకించుచు యూరకుండును. తాను సాక్షిభూతుడగు నాత్మననియు విషయముల నుపసంహరించుకొనుటకు వాటితో తన కెట్టిసంబంధమును లేదనియు గ్రహించుట "సంయమి" యొక్క లక్షణములు. ఈ ఆత్యుత్తమమైన స్థితి రెండు విధములుగా నుండును. వృత్తి పూర్తిగా లయరూపమున నిర్మూలమై ముక్తి గాంచుట మొదటిది. రెండవది: అది భగవంతుని లీలయని గ్రహించి, దానిని త్రోసివేయుటకుగాని లేక తన స్వప్రయోజనములకు వినియోగించుకొనుటకుగాని యాత్మ దానిని భగవంతునికే విడిచిపెట్టుట. తన సర్వస్వమును భగవదర్పణముచేసి, తనలో పనిచేయుచున్న శక్తి భగవచ్ఛక్తియేయని గ్రహించిన కర్మయోగిభావ మిట్లే యుండవలెను. ఇట్టి యాత్మార్పణమువలన జరుగు

ఫలితమేమన, ఆ సర్వేశ్వరుడే కార్యభారమునువహించి, గీతలో నీయబడిన అభయహస్తము ననుసరించి తన సేవకుని, తన భక్తుని సర్వదోషములనుండి రక్షించును. శరీరయంత్రములో పనిచేయు వృత్తు లాత్మ నెంతమాత్రము తాకక భగవంతుడు తన ప్రయోజనములకొరకే వాటిని లేపుచుండును. ఇదియే నిర్లిప్తత : లీలలో నుండియు సంపూర్ణస్వాతంత్రత ననుభవించుట.

వ్యక్తులకును, సమష్టికినికూడ నీధర్మమొక్కటే. వ్యాఘ్రతత్త్వమును, మర్కటతత్త్వమును యాచరించుటే మానవ పరిణామతత్త్వమని ప్రబోధ పరిజ్ఞాన నేత్రము లున్నవారు కనుగొని యున్నారు. క్రౌర్య, లోభ, దుర్మార్గ, విధ్వంసక, అసత్య, దౌర్జన్య పశుత్వ అజ్ఞానశక్తులే యొకప్పుడు మానవలోకమున రాజ్యము చేసెను. వాటికి సంపూర్ణభోగము కలిగెను. యూరపు దేశమున క్రైస్తవ మతారంభమైనట్టి కాలమువంటి కాలములలో నివి మతి వేదాంతాభివృద్ధుల వలనను కొంతవరకు నిగ్రహముచేతను అణచివేయబడెను. కాని యివి తిరుగ నంతకంటె యెక్కువగా విజృంభించి మునుపటి కంటెకూడ మరింత జయప్రదముగా తమ్ము స్థాపించుకొన జూచెను. చిట్టచివరకు 19-వ శతాబ్దములో వీటిలో కొన్నిశక్తులు పూర్తిగా నలసిపోయి, సంయమమునకు సమయామసన్నమై పరిణామమునుండి గెంటివేయబడి నాశనము కావలసిన అంత్యకాలమువచ్చినట్లు కొంతకాలమువరకు కాన్పించెను. ఇట్టిఆశ లెప్పుడును

కలుగుచునేయుండి చివరకు ఫలించవచ్చును. కాని అది జరుగులోపల మఱియొకసారి యీ దుష్టశక్తులు తల యెత్తుట తప్పదు. ఇట్టి చిహ్నములు ఇప్పుడే మనకు యూరపు అమెరికా దేశములలో శాస్త్రము, అభివృద్ధి, నాగరకత, మానవలోక ప్రేమలు అనెడి దంభోక్తుల చాటున, ఈ బాహ్యప్రదర్శనముల వెనుక, కావలసినన్ని కాన్పించుచున్నవి. ముందు మనమీదకు వచ్చిపడుచున్న యుగములోకూడ నింతకన్న యెక్కుడు సూచనలు కాన్పించగలవు. రాజకీయములలోను, సాంఘికములోనుకూడ నిట్టి విధానమే జరుగుచున్నది. మానవలోకము యొక్క రాజకీయ పరిణామమునందు లోకశక్తి ననుసరించి స్వేచ్ఛ, సమత్వము, సౌభ్రాతృత్వము అను యాశయములను మొన్నటి ఫ్రాంసు విప్లవము వెలిబుచ్చెను; కాని నిరంకుశత్వము, వంశపారంపర్యత హక్కులు, ఆర్థికములను స్వార్థముకొరకు దోచుకొనుట, సౌభ్రాతృత్వ విరుద్ధమైన యుద్ధములు, చిన్న రాష్ట్రకే శ్రీరామరక్ష పెట్టుకొను పోటీలు - ఈ పాతయుగపు దుష్టశక్తులన్నియు ప్రపంచరాజ్యమును తిరుగ నధిష్ఠించ నుంకించుచున్నవి. ప్రపంచములో దృఢమైన యిట్టి తిరుగుబాటు గోచరించుచున్నది. అభివృద్ధి, స్వేచ్ఛలకు కంకణమును కట్టుకొని జగజ్జెట్టీలమని తమకుతామే పేరు పెట్టుకొని వీరాలాపములాడిన యిగ్లండులోనే, ప్రపంచములో మఱెచ్చటను కలుగనట్టి, యిట్టి సంకటములు ప్రాప్తించును. పరిణామమునుండి పూర్తిగా నశించుటకు

భవిష్యత్తు. ప్రాతయుగపు శక్తులైన నిరంకుశత్వము, హద్దులేనిపోటీపద్ధతి సామ్రాజ్యాధిక్యతలు మరియొకసారి పూర్తిగా పరాజయము నొందినతరువాత, క్రమసంయమ విధానమునకు సమయమేర్పడి, ఆ శక్తులయొక్క నిర్జీవ ప్రతిమలుగా మిగిలిపోయిన అస్థిపంజరములు ఎక్కుడు నిగ్రహ మక్కర లేకుండగనే పరిణామమునుండి తిన్నగా శాశ్వతముగా త్రోసివేయబడును.

గాను తగినంత యలసట నది చెందవలెను. ఈ స్థితికొరకే
తిరుగ వెనుకటితత్త్వము తలయెత్తును. అది పరాజయ
మునొంది నాశనము నొందుటకే తలయెత్తుచున్నది.
ప్రజాస్వామిక శక్తిగాత్రి మట్లుగాక దానికి కావలసిన
భోగమంతయు ముందేయున్నది. అది యింకను మంచి
యౌవనములోను, పటుత్వముతోను యుండి, తృప్తి
చెందక సంపూర్ణానుభవము కొరకు కాతురపడుచున్నది.
దీని నణచివేయుటకు భూతకాలములో చేసిన ప్రయత్న
ములన్నియు భగ్నమైపోయెను. పైగా వీటిఫలితముగా
ప్రజాస్వామిక తత్త్వము మరింత భయంకరముగను,
సహస్రాకారములతోను, సహస్రవదనములతోను విజృం
భించి స్వేచ్ఛ, సమత్వము సౌభ్రాతృత్వములను ఆశయ
త్రయమునకు విజయముగా, 'లేక మృత్యువా' అను సంకల్ప
మునుకూడ చేర్చుకొనెను. ఈప్రజాస్వామిక వాద పతితస
మీపస్థ భవిష్యత్తులో, అరాచక స్వేచ్ఛ నాశించునట్టి స్వా
తంత్ర్యోపాసకుల సంపూర్ణ కలల నన్నిటిని, యీడేర్చు
నట్లు లేదు. చైతన్యరాహిత్యమైన మృతసాంఘిక సమ
త్వము నాశించునట్టి సమత్వారాధకుల ఆకాశ కుసుమ
ములనుకూడ నది నెరవేర్చునట్లు లేదు. ప్రపంచమునంతను
ఆశ్లేషించు సాంఘికతత్త్వము నాశించునట్టి సౌభ్రాతృత్వా
రాధకులనుకూడ నది తృప్తిపరుచునట్లు లేదు. కాని ఈ
మహోత్కృష్ట యాశయముయొక్క సామరస్యమును
కొంతవరకైనను చూరగొనుటకే మానవజాతి నిస్సందే
హముగా ముందుకు పోవుచున్నది. ఇదియే దాని సామీప్య

భవిష్యత్తు. ప్రాతయుగపు శక్తులైన నిరంకుశత్వము, హద్దులేనిపోటీపద్ధతి స్వార్థాధిక్యతలు మరియొకసారి పూర్తిగా పరాజయము గాంచినతరువాత, క్రమసంయమ విధానమునకు సమయమేర్పడి, ఆ శక్తులయొక్క నిర్జీవ ప్రతిమలుగా మిగిలిపోయిన అస్థిపంజరములు ఎక్కడు నిగ్రహ మక్కర లేకుండగనే పరిణామమునుండి తిన్నగా శాశ్వతముగా తోసివేయబడును.



# మౌనబలము

ఈవిశ్వములో మౌనము, వాక్కు అను రెండు ఉత్కృష్టశక్తు లున్నవి. మౌనము తయారుచేయును; స్థిరముచేయును. వాక్కు సృష్టించును. ఒకటి అంతరంగిక క్రియ; రెండవది బహిరంగక్రియ. మౌనము పని చేయును; వాక్కు కార్యమునకు ప్రోత్సాహము నిచ్చును మౌనము బలవంతము చేయును: వాక్కు సలహా నిచ్చును. ఈ విశ్వముయొక్క అనంత, అగ్రాహ్య, అనూహ్యవిధానము లన్నియు సంతరంగములోనే పరిపూర్ణతనొందును. పైన, సత్యమును మోసగించు డబడబధ్వనుల నొసగు బాహ్యతలము: లోపల, అగాధ గంభీరమౌనము. పైన, అనంతకోటి తరంగముల రెపరెపలు; లోపల అగాధ, యుశాంత జలరాశి. మానవులు పైతరంగములను చూతురు; గుసగుసలను విందురు; వేలకొలదిగా వచ్చుచుండు ధ్వనుల నాకర్ణింతురు. వీటిని బట్టి భవిష్యచ్చరిత్రను లెక్కలు వేయుదురు; భగవదుద్దేశమును నిర్ణయింతురు. నూటికి తొంబదిచోట్ల వీరి నిర్ణయము లసత్యనిర్ణయము లగుచుండును. కనుకనే

చంద్రులలో ననూహ్య విపరీతసంఘటనములతో సదా సంభవించుచుండునని చెప్పుచుందురు. మానవులు తమదృష్టిని అయథార్థమైన బాహ్యమునుండి ప్రచ్ఛన్న సత్యమునకు మరల్పగలిగినచో నవి యెప్పుడును అనూహ్యములుగాక సహజములు, న్యాయములుగనే తన్పించ గలవు. వారు జీవితములోని బుడబుడమను బుద్బుదములకొరకే చెవియొగ్గక దానిలోని మౌనము నాకర్ణించుచో సత్యమే విశదము కాగలదు. మనపూర్వులు వాయు నిరోధముచేసి యుత్కృష్టకార్యములను కొనసాగించిరి. ఉచ్ఛ్వాసవేగ మెంతయెక్కువైన నంతశక్తి తగ్గిపోవు చుండును. పనిచేయుచున్నపు డెవరు సహజముగా, నప్రయత్నముగా గాలిని నిరోధించునో యతడే దీర్ఘమునందంతటను పనిచేయుచు, సృష్టించుచుండు ప్రాణశక్తికి ప్రభువగుచున్నాడు. మనోవృత్తి మానినపు డుచ్ఛ్వాస నిశ్వాసము లాగిపోవుట యోగుల కతిసామాన్యమైన యనుభవమే! అనంతమైన బాధలనొంది, విశ్వప్రయత్నములనుజేసి హఠయోగి ప్రాణకుంభకమును సులభముగా, సుఖముగా సాధించుకొనవచ్చును. కాని మనోవృత్తి తిరుగ ప్రారంభించినచో యుచ్ఛ్వాస నిశ్వాసములు తిరుగ ప్రారంభము కాకుండగనే మనోవృత్తి ప్రవహించు నేపల ప్రాణము నిజముగా జయింపబడుచున్నది. ఇదియొక ప్రకృతి ధర్మము. మనము పనిచేయుటకు ప్రయత్నించునపుడు ప్రకృతిశక్తులు మనచే తమకోరికలను నెరవేర్చుకొనును. మనము మౌనము వహించు

సప్రజాశక్తులకు మనమే ప్రభువుల మగుదుము.

కాని మౌనములు రెండువిధములుగా నున్నవి. మొదటిది, శక్తిలేని, నిస్సహాయమైన మాంద్యపిశాచము. ఇది నాశనమును తెచ్చిపెట్టును. రెండవది సామ్రాజ్యాధిపత్యముతో గూడిన మౌనము; ఇది జీవిత సామరస్యమును చూరగొనును. యోగియొక్క మౌనము సామ్రాజ్యోచిత మౌనము. ఈ మౌనము యెంత పరిపూర్ణమైన, యోగశక్తి అంతయెక్కుడమోఘమగును; అంతయెక్కువ కార్యశూరత్వమును వహించును.

ఈ మౌనములోనే, ఈ గంభీతలోనే యథార్థజ్ఞాన ముద్భవించును. మానవుల చింతనములు సత్యానృతములతో గూడిన కలగూరగంపలు. యథార్థదృష్టి అసత్యదృష్టిచే నావృతమై మఱుగుపడిపోవును. యథార్థవిచక్షణ అయథార్థ విచక్షణచే కుంటువడును. యథార్థతలంపు లసత్యతలంపులచే వికలమగును; యథార్థస్మృతి సత్యవిస్మృతిచే వంచింపబడును. మనోవృత్తి యాగిపోవలెను. చిత్తశుద్ధి చేకూరవలెను. అశ్రాంత ప్రకృతిని మౌన మావహింపవలెను. అప్పుడా శాంతిలో, "ఆ మౌనములో ఆ ధ్వని రాహిత్య నిర్మల గంభీరతలో మనస్సును తేజమావరించును. ప్రమాదములు బాసిపోవును. కోరికలు తిరుగ పుట్టకుండ యున్నంతకాలము జ్ఞానోదధి యడుగుభాగమున శాంత్యానందములు తాండవించును. పైభాగమున స్ఫటికస్నిగ్ధత, నిర్మలత్వము, విజ్ఞానము స్థాపితమగును. యథార్థజ్ఞానమే యథార్థ

కర్మకు ప్రమాదరహితమైన మూలాధారము; "యోగః కర్మ సుకౌశలం".

యోగియొక్క జ్ఞానము కామచోదితమైన సామాన్య మనోజనక జ్ఞానమువంటిదికాదు ; అది బాహ్య విషయముల నాధారముగా గొనునట్టియు, ప్రత్యక్షాను మానములను నూతగాగొనునట్టి శాస్త్రోద్భవజ్ఞానమును, ప్రాపంచికజ్ఞానముచేకలుగు హేతుజ్ఞానమును కాదు. భగవంతుని కర్మకలాప విధానము యోగికి తెలియును; విషయములు మోహపఱచుననియు, జరుగు ననుకొన నట్టివే తరుచు జరుగుచుండుననియు నత డెఱుగును. అతడు హేతుజ్ఞానమునుండి విజ్ఞానమను ప్రత్యక్ష తేజోమయజ్ఞానమును చేరుచున్నాడు. కామచోదిత మనస్సు సుఖదుఃఖములు, మంచిచెడుగులు, సంతోష విచారములు అను దుర్ఘట ప్రతిద్వంద్వములచే నుక్కిరిబిక్కిరియగుచుండును. అదెప్పుడును మంచిని, సంతోషమును, సుఖమును పొందుటకే ప్రయత్నించుచుండును. అదృష్టములు సంభవించినపు డది యుబ్బిపోవును. దురదృష్టములు సంభవించినపుడు కృంగిపోవును; కొట్టుకొనిపోవును. కాని యోగియొక్క తేజోమయదృష్టి సర్వత్ర మంచినే చూచును. అతనికి ప్రతిదియు మంచికే దారిచూపుచుండును. అతనికి భగవంతుడు సర్వవ్యాపి, సర్వమంగళుడు ; పైకి కాన్పించు చెడుగు, మంచికి సూక్ష్మమార్గమని యత డెఱుగును. అసంతోషము సంతోషమును కూర్చుటకు విధాయకమార్గమని యత డెఱుగును. దుర

దృష్టమత్యంత యదృష్టమును బడయుట కవసరమని యతడెఱుగును. అతని బుద్ధి ద్వంద్వాబానిసత్వమునకు తలయొగ్గనేరదు.

కనుక యోగిచేష్టలకును సామాన్యమానవుని చేష్టలకును ఎంతో వ్యత్యాసముగలదు. అత డెప్పుడును చెడుగుకే తలయూపునట్లును, దురదృష్టమును పోగొట్టుకొను ప్రయత్నములను బుద్ధిపూర్వకముగా విడనాడునట్లును, దుష్కర జాడ్యమును, క్రౌర్యమును సహించుకొను మహాత్ములుచేయుచుండు ప్రయత్నముల కును ఉద్యమములకును యనంగీకారమును చూపునట్లు ను కాన్పించును; అతని కార్యములన్నియు పిశాచ వత్తుగా నుండును. లేదా కార్యాచరణకు గడంగవలయు నని ప్రజ లనుకొనునపు డతడు నిశ్చలుడుగా నూరక యుండుటచేతను, బ్రహ్మాండభాండము నెగురగొట్టు నట్లు మహోపన్యాసముల నీయవలయునని వా రను కొనినపు డతడూరక మౌనము వహించియుండుటచేతను తీవ్ర, గంభీర భావాందోళన యవసరమైనపు డతడు చలించక నిశ్చలమానసుడై యుండుటచేతను మానవు లతనిని జడుడు, చైతన్యరహితుడు, మొద్దు, రాయి అని పిలుతురు. అతడు కర్మచేయునపు డతనిని పిచ్చి వాడు, ఉన్మత్తుడు, శుంఠ, లేక వెర్రివేపకాయ అని పిలు తురు; అతని కర్మలన్నియు లక్ష్యశూన్యము లేక అర్థ రహితముగను, అడవి స్వభావము గలవిగను, క్రమా భావముగను, జ్ఞానమును జయమును గ్రహించజాలనట్టి

శుద్ధ మొద్దబ్బాయి కర్మవలెను లేక యీప్రపంచము నకు పనికిరానట్టి ప్రయోజన దృష్టులచే ప్రచోదితములై నట్లును కాన్పించును. అత డనుగమించు జ్యోతి ఇతరుల కుండదనుట సత్యము. లేదా యది వారి కంధకార మగును. వారి కేవి కలలవంటివో అతని కవి పరమసత్య ములు; వారి రాత్రియే యతని దినము. ఈభేద దృష్టుల కు కారణమేమన వాదు తర్కప్రతర్కములు చేయు చుండ నతడు గ్రహించును; తెలిసికొనును.

మౌన ముద్రను వహించుట; గంభీరతను దాల్చుట; తేజోమయాన్వితమగు చిత్తప్రశాంతతను జెందుట—అమృతత్వమునకు కారణము; 'అమృ తత్వాయ, కల్పతే,' ఇదియే, మన ప్రాచీన నాగరికత యొక్క ఆదర్శపురుష లక్షణము; 'ధీర' పురుషలక్షణ ము. ఇది చైతన్య రహితమైనదిగాదు; మొద్దుగాదు; తమస్సు కాదు. తామసునియొక్క తమోగుణము తన చుట్టుపట్లనున్న శక్తులను స్తంభీభూతము చేయును. యోగియొక్క మౌనము, సృష్టి, స్థితి, లయములను చే యును. వాని కార్యము ఉత్కృష్ట ప్రకృతి శక్తుల ప్రచండ ప్రచోదనశక్తికి మఱింత యుద్వేగమును కలుగ జేయును. వాని అగాధమైన ఆంతరంగిక గంభీరత, క్వచితుక్వచితుగా వినవచ్చుచుండు భాషాతరంగముల తోఁగూడిన క్రియాబాహ్యమును ఉపరితలమున కలిగి యుండవచ్చును. పైకి వినిపించు ప్రపంచ రొదచేతను, బుద్బుద విషయములచేతను మానవులు భగవల్లీలలోని

యథార్థతను గానజాలనట్లే యోగియొక్క కర్మలను కూడ వారు గ్రహించజాలరు. అతని యంతరంగము వేరు. బహిరంగము వేరు. అతని బహిరంగ మంతరంగమును చూపజాలదు. వాగ్బలమును, కర్మబలమును కూడ గొప్పవనుటకు సందియములేదు. జెరికోగోడలు ఫిరంగిధ్వనుల చేతనేగదా కూలినవి? కాని కర్మకలాపము కొఱకు మహాశక్తులను తయారుచేయుచుండు మానసగంభీరతాశక్తి యనంతము; అపారము.



# పురుషత్రయము

ఈదృశ్యప్రపంచము నంతను ఉజ్జీవింప చేయు చున్న చైతన్యజ్యోతి యొక్క యథార్థస్వభావ మెద్ది? దానికిని మనకునుగల యథార్థ బాంధవ్య మెట్టిది? సమస్య లన్నిటికెల్ల సమస్యయైన, ఈ పరమాత్మస్పష్ట వేదాంత సమస్యకొరకే మానవకోటి నిరంతరాయ ప్రయత్నము లను సలిపినది. మాయావాదులు ఈదృశ్యప్రపంచము మిథ్య యందురు. ప్రపంచవాదులు చైతన్యజ్యోతియే మిథ్యయందురు. ఈదృశ్య ప్రపంచ మద్వితీయవిశ్వాత్మ తేజోవిరాజమానమైన నిర్మలశాంతి సముద్రముపై తృటిలో నదృశ్యమగు మేఘచ్ఛాయ యని మిథ్యా వాదు లందురు. చైతన్యజ్యోతి, విషయప్రచాలనచే కలుగు తాత్కాలిక ఫలితమని ప్రపంచవాదు లందురు. ఆఛాయ యెట్లుత్పన్నమయ్యెనో మాయావాదులు చెప్ప జాలరు. అది 'సత్' (ఉన్నది) అనియు, అయ్యును 'అసత్' (లేనిది) అనియు అందుచే ననిర్వచనీయమనియు వారొప్పు కొనెదరు; జడమునందు చైతన్య మెట్లుత్పన్న మయ్యెనో ప్రపంచవాదులు చెప్పజాలరు. వారు దాని యభివృద్ధిక్రమ

మును, దాని కార్య విధానమును నేకరువుపెట్ట నారం భించి దాని నిర్వాచనలోపమును తమ పరిశోధనా బహుళ ములచే పూర్తిచేయుదురు. కాని అంతరంగమును బహిరంగమునుకూడ తిలకించుచుండు మానవాత్మ శంక రునితోగాని హెకెలుతోగాని తృప్తిపొందుటలేదు. అది దృశ్యప్రపంచమును సర్వత్ర చూచుచున్నది. అది చైతన్యమును సర్వత్ర చూచుచున్నది. అది రెంటిని అంగీకరించునట్టి, యిముడ్చునట్టి, ఐక్యముచేయునట్టి నిర్వాచనము కొఱకే చూచుచున్నది. అది రెంటిని సమ న్వయము చేయును; గాని దేనిని విడనాడజాలదు.

ఉపనిషత్తులు ప్రపంచము అయథార్థమని యెచ్చటను చెప్పుటలేదు. అవి దాని కతీతమైన బ్రహ్మ ముతో ప్రపంచము నైక్యము చేయుచున్నవి. ఆత డొక్కడు, అద్వితీయుడు; సర్వమును ఆతడే. అంతయు బ్రహ్మమేయైనచో బ్రహ్మేతరమైన దేదియు లేదు. కనుక నీ సర్వప్రపంచస్థితి ఈ "సర్వమిదం" స్థితి బ్రహ్మయొక్క ఏకత్వమున కెంతమాత్రమును విరుద్ధముకాదు. ఇది భేద మును నిరూపించజాలదు. ఒకేచైతన్యము తన్ను తా ననేక దృష్టులనుండి తిలకించుకొనుచున్నది. ప్రతిదృష్టి యు నితరదృష్టుల జ్ఞానమునుకలిగి వాటిస్థితి ననుభవించు చున్నది. భావములు, తలంపులు, ఊహలు, అనుభవ ములు, నామరూపములు, చలనములు, ఉద్రేకము లు - మొదలగు నపారపారావారప్రవాహము, అనా దిగా, అనంతముగా, నిరంతరాయముగా, పైకిలేచుచు

నభోమణినంటుచు, సుభాలునకూలుచు దృక్పథమునుండి మాయమగుచు నిరంతర ప్రయాణమును సాగించుచున్నది. ఒకే క్షేత్రత్యమే యీ ప్రవాహముద్వారా తన యనంతకోటి యాత్మరూపములతో తననుతానే ప్రవహింపజేసికొనుచున్నది. ఒకేసముద్రము, అనంతకోటి తరంగములు. ఇందులో నొకయాత్మరూపము తన పరమావధిని జేసుకొనవచ్చును. కాని అంతమాత్రముచే దృశ్యప్రపంచము మాయము కాజాలదు; నశించజాలదు. ఒకటైనది (సముద్రము) శాశ్వతము; కనుక అనేకము లైనవి (తరంగములు) కూడ శాశ్వతములే యగును. సముద్ర మున్నంతకాలము తరంగము లుండితీరునని వేఱుగ చెప్పవలెనా?

సముద్ర కల్లోలములో, విశ్వప్రకృతి మార్పులలో, పురుషుడు లేక ఆత్మ నిత్యుడు, సర్వగతుడు, స్థాణుడు, అచలుడు, సనాతనుడు. ఈ విశ్వమంతటిలోను పురుషుడు లేక ఆత్మ ఒకడే; ఈ విశ్వకల్లోలమునంతను జరిపించు ఆత్మ ఒకడే, అనేకములుకావు. వ్యక్తులలోని పురుషుడు ఒకడే త్రివర్తనుడై యున్నాడు; మూడువిధములుగా నున్నాడు. ఉపనిషత్తులలో నొకచెట్టు, రెండు పక్షులుగల యుదాహరణముకలదు. ఒకపక్షి ఆ చెట్టు పండును తినుచున్నది. రెండవపక్షి మరియొకఉన్నత శాఖపై కూర్చొనియున్నది; అది ఫలమును తినుటలేదు. కాని తనతోడిపక్షిని చిద్విలాసముగా పరీక్షించుచున్నది. ఒకటి ఈశుడు అనగా ఆత్మేశుడు, తనకు తానే

ప్రభువు. రెండవది అనీశుడు, పరవశుడు. తనకుతాను ప్రభువు కాదు. ఫలమును అనుభవించుచున్నపక్షి పైకి తలయెత్తిచూచును. పైన సాక్షీభూతముగా నానందించుచున్న రెండవపక్షి కాన్పించుచుండును. మొదటి పక్షికి దానియుత్కృష్టత గోచరించి యిదికూడ దానితో పొంగిపోవును. వెంటనే దానిదుఃఖము, మృత్యువు, దాస్యము, మాయ, అజ్ఞానము అంధకార తిమిరమంతయు నశించును.

ఆ పక్షులు రెండును అనాదిపురుషులు, వాటికి పుట్టుక లేదు. ఆచెట్టు మధుర, ఆమ్ల ఫలములనిచ్చు అనాదిస్త్రీ. దానికి పుట్టుక లేదు. ఒకపురుషుడు దాని మాధుర్యమును గ్రోలుచున్నాడు. మఱియొకడు దానిని దూరముగా నుంచెను. ఈ పురుషులిద్దరిలోను ఒకడు అక్షరపురుషుడు; రెండవాడు క్షరపురుషుడు; ఒకనికి నాశనము లేదు; మరొకనికి నాశనముకలదు. ఆచెట్టు లేక స్త్రీ,ప్రకృతి, విశ్వశక్తి. క్షరపురుషుడు ప్రకృతిలోనుండి, ప్రకృతి ననుభవించు ఆత్మ. అక్షరపురుషుడు ప్రకృతిపై నుండి దానిని పరీక్షించుచుండు ఆత్మ. ఆ చెట్టుమీద కూర్చొనక దాని నాక్రమించుకొని, దానిని కలిగియుండి, ఆత్మేశుడేగాక సర్వేశుడుకూడనైనవాడు మఱియొకడు కలడు. ఆతడు ఈ క్షరాక్షరులకంటె యుత్కృష్టుడు. ఆతడు పురుషోత్తముడు; భగవంతునితో నైక్యమైన ఆత్మ; విశ్వాత్మ. గీతలో 15–వ అధ్యాయములో నీపురుషత్రయమును గుఱించి యిట్లు వివరింప

బడియున్నది. "ఈప్రపంచములో క్షరాక్షరులను నిద్దరు పురుషులు కలరు. సర్వభూతములు క్షరుడు. అక్షరుడు కూటస్థుడు; పైనుండువాడు. అవస్థాత్రయమగు జాగ్రత్స్వప్న సుషుప్తులలోనుండి, వాటి నుజ్జీవింప చేయుచుండు పరంధాముడు, పురుషోత్తముడు, లేక పరమాత్మ మఱియొకడు కలడు." 13-వ అధ్యాయములో నీపురుషులలో గలభేదమును గుఱించి చెప్పుచు శ్రీకృష్ణుడు ప్రకృతిని, వ్యక్తులలోనున్న ఆత్మ భగవంతులకునుగల సంబంధమును విశదీకరించియున్నాడు. "ప్రకృతియే, కార్యకారణ కర్తృత్వములకు హేతువగుచున్నది. పురుషుడు భోక్తయగుచుండుటచే సుఖదుఃఖములకు కారణమగుచున్నాడు. ప్రకృతిలోనున్న పురుషుడే ప్రకృతిగుణత్రయమైన సత్త్వరజస్తమోగుణములచే సృజింపబడు సృష్టి, స్థితి, లయములను, ఆగ్రహానుగ్రహ నిగ్రహములను, తేజోభ్రమాంధకారములను, సత్త్వ రజస్తమస్సులను అనుభవించుచుండును. గుణసంగముచేత నే ఆత్మ ఉత్కృష్ట నికృష్టయోనులందు జన్మించుటకు కారణమగుచున్నది. ఈ దేహములో నుపద్రష్టగా, ఆమోదకుడుగా, భర్తగా, భోక్తగా, మహేశ్వరుడుగా నుండుపరమాత్మయే పురుషోత్తముడు."

పరమాత్మ వ్యక్తిగతమాత్రముగా నుండదు. అది విశ్వమంతటను నిండియుండును. సర్వభూతములలోనుండు ఊహాలు, అభిప్రాయములు, వర్తనలు అనుభవము, ఉద్రేకము, చలనము మొదలగువాటినన్నిటిని ఆతడు తన ఆధ్యా

త్మిక భోగముకొఱకు విలాసవస్తువుగా కలిగియుండును. కాని ఇవేవియు నతడుకాడు; ఇవి అతనిని నిరూపించ జాలవు. నత్తగుల్లలు, చేపలు, ముత్యములు, రత్నములు మొదలగునవనేకములు సముద్రములో నుండును. కాని నత్తగుల్ల సముద్రముకాదు. చేపలు సముద్రముకాదు. కాని అది వీటన్నిటిని, తనయందు కలిగియుండునది. వ్యక్తిస్థితిని బలపఱచుటకును, సృష్టించుటకును యిట్టి విశ్వాత్మ అవసరమయ్యెను అది వ్యక్తిస్థితిని నిర్వచించి దాని నరికట్టజాలదు. అది కొంత తనలో నిలువచేసికొని కొంత నిచ్చివేయును. ఈ యర్ధాంశమే, వ్యక్తిమానవుడు. "నాలోనున్న ఒక సనాతనాంశమే జీవుడగుచున్నాడు." జీవుడే, వ్యక్తియే క్షరపురుషుడు. ఆత్మానంద పరవశత్వము నొందుచు, ప్రకృతిలీల కుదాసీనుడై, దాని నసక్తతతో పరీక్షించుచు, తా నెంతమాత్రమును బద్ధుడుగాక, సనాతనాత్మస్థుడై, సనాతన స్వతంత్రుడై, తన యచల, ప్రశాంత, నిర్మలస్థితిపై ప్రకృతిఛాయను గ్రహించుచు చెట్టుపై కూర్చొనియున్న పక్షియే ఈ జీవునకును పరమాత్మకును మధ్యనున్న అక్షరుడు. ఈ అక్షరుడే మన నిజాత్మ: అది యగుటయే మన దృశ్యప్రపంచమునుండి, నశ్వరప్రపంచమునుండి విడివడుట. ఇది లేనిచో మనకు జరామరణములనుండి, సుఖదుఃఖముల నుండి, పాపపుణ్యములనుండి మోక్షమే యుండదు; మనము తలుపులేని పంజరములోనుండి పారిపోవుటకు రెక్కలను టపటప యినుపకమ్ములమీద కొట్టుకొనుచు

ముక్తిని గానని పశువలెనుందుము; సుఖదుఃఖములు, జరామరణములు, పాపపుణ్యములు ఈయుత్కృష్టజీవిత కేళిని సలుపుటకు తాత్కాలికముగా యేర్పడినసూత్రములుగాగాక, శాశ్వతబ్రహ్మకల్పములుగా నశ్లే యుండిపోవును. మనము మనచిత్తమువచ్చినపు డాడుకొనుచు లేనపుడు మానివేయుచు భగవంతునితో కేళి సలుపు స్వతంత్రచెలికాండ్రముగాక బలవంతముగా సిద్ధుకొని బడు నటకుల మగుదుము. మన మక్షరపురుషునితో నైక్యమును గ్రహించినపుడే అజ్ఞాన తిమిరమునుండి, కామపాశమునుండి, కర్మబంధమునుండి ముక్తినిగాంచుదుము. సాంఖ్యవేదాంతము ప్రకారము అక్షరుడొక్కడే యుండి క్షరుడులేనిచో భేదానుభవములకు హేతువుండదు. భిన్నవ్యక్తులేయుండరు. ప్రతివ్యక్తి ఇతర వ్యక్తులవలెనే యుండును. ప్రకృతిలోని ప్రతి ఆత్మయొక్కవృద్ధియు, అనుభవమును పోతపోసినట్లు ఒక్కమాదిరిగనే యుండును. క్షరపురుషుడే సర్వభూతములును అయియున్నాడు. సచేతన యునికియొక్క విశ్వగతస్వభావములోని ఒక్కొక్కభాగము,రూపాత్మకసంభూతియం దొక ప్రత్యేకజీవునితో సక్తమై భిన్నానుభవములను,భిన్నాభివృద్ధులను, భిన్నవర్తనములను కలుగజేయుచున్నది. భగవంతునిలోని ఒకయంశము జీవు డగుచున్నాడు అను భావమున కిదియేయర్థము. ఒకసారి నిశ్చయమైన, ఈ స్వభావ మెన్నటికి మార్పుపొందదు. ఇది వివిధములైన యంశములనే,వివిధకాలములలో వివిధపరిస్థితులలో

త్రా ననుభవింపవలసిన యభివృద్ధి కనుకూలించు వివిధ శరీరములలో, వివిధక్రియారూపములలో ఆవిర్భవించు చుండును. కనుక నే ప్రకృతిలోనున్న పురుషుడు సనాతనుడు, స్థిరుడు, అచలుడైనను, క్షరుడు మార్పునొందువాడు చలించువాడు అని యందురు. కాలకారణస్థలములలో పొందుచుండు వివిధానుభవములచేత నే నది క్షరమగుచున్నది. అక్షరుని యనుభవసూత్రము; కాల, కారణస్థలములకది అతీతము; అదివాటి నెరుంగును; ప్రకృతియొక్క నిరంతరానేక తుంగోత్తుంగ ప్రవాహము దాని నంటజాలదు. పురుషోత్తముని యనుభవము ప్రకృతిలోను వెలుపలనుకూడ కలదు. అది అన్ని యనుభవములను భోగములను ఆశ్లేషించుచు వాటిలోని నిజతత్త్వమైయుండును.

క్షరపురుషుడు అభివృద్ధిని నిశ్చయించునుకాని దాని నతడు నడుపడు. ప్రకృతి, విశ్వశక్తి, కార్యకారణ ధర్మము ననుసరించి అభివృద్ధిని నడుపుచుండుటచే నదియే నిజమైనకర్త; ఆత్మ కర్త కాదు. అతడు తనకర్తయైన ప్రకృతియొక్క కార్యఫలముల ననుభవించు ప్రభువు. అతడు ప్రకృతి మోహముచే దానియందు సక్తుడై ఆత్మవిస్మృతి నొంది, కర్తృత్వమును తనపైనారోపించుకొని, ఆత్మేశ్వరత్వమును పోగొట్టుకొని కారణబద్ధుడై, కాల దేశములందు తగుల్కొని తానారోపించిన కర్మచే తానే బద్ధుడగుచున్నాడు. దైవాంశుడగుటచే నతడాతని స్వరూపముగానే, ఆతని స్వభావముననే

సృష్టింపబడినాడు. కనుక భగవంతుడేమగుచున్నాడో ఇతడును నదేకాగలడు. అతడు తనకుతానే స్వేచ్ఛికముగ నంగీకరించి తెచ్చిపెట్టుకొనిన కాల, కారణ, స్థలములకు బద్ధుడగుచున్నాడు. అతడు సాక్షి, అతడు పరీక్షించుచుండుటను మానివేసినచో నాటకమే ముగిసిపోవును. అత డామోదకుడు, అతడు దేని నామోదించుట లేదో అది వృద్ధినుండి తగ్గిపోవును. అతడు భోక్త; అతడుదాసీనుడైనచో వ్యక్త్యభివృద్ధి యుండనేరదు. అతడు భర్త; అతడాధారమును, శరీరమును, భరించుట మానినచో శరీరము పడిపోవును, నాశనమగును. అతడు మహేశ్వరుడు. ప్రకృతి అతని ఆనందముకొఱకే పని చేయుచున్నది. అతడు ఆత్మపదార్థము. అతనిరథము, ఆతనిశరీరము, ఆతని ఆత్మప్రకటనకొక సాధనము. కాని అతని ఆమోదములు, తిరస్కారములు, ఆజ్ఞలు ఇవన్నియు తక్షణమే, ఏకకాలమందే ఏకదేశమందే అప్పుడే అచ్చటనే, ఒకేసారి సర్వాధికారప్రయోగముచే బలవంతముగా పనిచేయజాలవు. కాలము గతించవలెను, స్థలము మాఱవలెను. కార్యమునకు కారణము పనిచేయవలెను. ఆ కార్యవ్యవధి ఒకక్షణికమే కావచ్చును, లేక శతాబ్దములు కావచ్చును. మార్పుకొద్దిదే కావచ్చును. గొప్పది కావచ్చును. ఇక్కడే జరుగవచ్చును, మఱియొక జన్మములో జరుగవచ్చును; పని ప్రత్యక్షముగా జరుగవచ్చును, అప్రత్యక్షముగా జరుగవచ్చును; విధానముల ఏకీకృత మతిశీఘ్రముగ జరిగి మానవు లనుకొను

# అంతర్నిహితాత్మశక్తి

ఈప్రపంచమొక గొప్ప దాగుడుమూత ఆట వంటిది; ఇక్కడ జడము వెనుక నాత్మయు, అయథార్థము వెనుక యథార్థము దాగొనియుండును. అయథార్థమే యథార్థ వేషమును వేసుకొనును. యథార్థము అస్పష్టముగా అవాస్తవిక ఛాయవలె కనబడును. దృశ్యప్రపంచములోని మోహనాకారము, దాని ధర్మములు మానవులను మోహపఱచి బానిసలనుచేయును. "ఈ జగత్తు ఒక యద్భుతయంత్రము. ఇది తన నిజశక్తిచేతనే కదలుచున్నది. దీనికినాయకుడక్కఱలేదు. సృష్టికర్త అవసరములేదు; ఇదెప్పుడును దానంతటదే కదలుచుండును" అని మన మందుము. మన మర్ధసత్యముచే కండ్లు కప్పబడినవారమై, ప్రపంచము కర్తలేని యంత్రమనుటకు బదులు నిజముగానున్న యొకస్థితి మాత్రమేయనియు అదియొక యంత్రముకాదనియు తెలియజాలకున్నారము. హిందువులు ప్రపంచమునకును భగవంతునకును గల సంబంధమును తెలియజేయుట కనేక సాదృశ్యములను కలిగియున్నారు. కాని యంత్రమను భావము

మాత్రము వారిలో కానరాదు. తేజస్సు, దాని సహస్ర
కిరణములు; సాలెపురుగు, దాని తంతువులచే నిర్మింప
బడువల; ప్రతిఅణువును ఉప్పుతో నిండియుండు ఉప్పు
నీటి సముద్రము. ఇట్టి సాదృశ్యములే మనలో కాన్పించు
ను. ఈప్రపంచము జాగ్రత్స్వప్నము, మూర్తిత్వమును
ధరించిన దృశ్యము, అట్టి దృశ్యములతో గూడినజ్ఞానరాశి.
ఈదృశ్యములే వివిధ భావప్రకటనలు; ప్రతిభావము
మార్పుగొందజాలనట్టి ఒకే సత్యముయొక్క రూపము.
అంతరంగముననున్నదే బహిరంగమగుచుండును; నూతన
సృష్టి ఏదియులేదు. 'సత్' అయినది 'అసత్' కానేరదు.
'అసత్' అయినది 'సత్' కానేరదు. అనగా లేనిది సృష్టింప
బడలేదు, ఉన్నదినశించదు. అది తనను తాను అంతరితమొ
నర్చుకొనవచ్చును. సనాతనతత్త్వములోని సర్వము సనా
తనమే. అతిపురాణమైనదేది? ఆత్మ. ఏకమైనదేది? ఆత్మ.
ఎప్పుడును ఉండునదేది? ఆత్మ. కాలములోను, స్థలము
లోను ఉండునదంతయునేవి? ఆత్మ. కాలమునకును, స్థల
మునకును దాటియుండునదేవి? ఆత్మ. మనమట్లేల
భావించవలెను? వేఱులేనట్టి, సనాతనస్థుడైన ఒకడే,
వేఱుగలిగినట్టి అనేకత్వమునకు శాశ్వతమును కల్పించుట
చేత. ప్రపంచములోని జడపదార్థము మొత్తముపైన
హెచ్చుటగాని తగ్గుటగాని లేదు. అదెప్పుడును ఒకే
మొత్తము. ప్రపంచములోని మొత్తము శక్తికికూడ
నట్లే హెచ్చుటగాని తగ్గుటగాని, లేదు. ఆత్మయునట్టిదే.
రూపములోనికి తీవ్రముగా కదులుచు ప్రవహించుచుండు

శక్తియే పదార్థము. శక్తిఅని మనము పిలుచు కదలికను ప్రకటించునదేదో అదియే ఆత్మ. ఆత్మఒకశక్తి, ఒకస్థితి; జడపదార్థము శక్తియు, రెండునుఆత్మలోని కదలికలు, చలనములు, మాత్రమే అగుచున్నవి. శక్తి స్థితులు ఆనందముతో కలసిన, సచ్చిదానందము; ఇదియే సనాతనమైన వస్తు తత్త్వము. కాని ఈశక్తి కదలిక కాదు. అది జ్ఞానము, లేక భావసత్యము. జ్ఞానము చలనమునకు కారణముకాని, చలనము జ్ఞానమునకు కారణముకాదు. కనుక ఆత్మయే సర్వమును అగుచున్నది; అది ఏకైకము. సచ్చిదానంద ములు మూడును కాని త్రివిధ ప్రకటనలు.

ఆత్మ మహత్తు (ప్రజ్ఞ)గా అవిర్భవించుకొనుటే ప్రపంచమునకు హేతువు. ఆత్మ దానిస్థితియందది ఒక్కటిగనే యుండును. అదియే ప్రజ్ఞగా మారినప్పుడు ఏకత్వమును విడువకుండ బహుత్వమును గుణించుకొను చున్నది. మనమాచెట్టునుచూచి "ఇక్కడ ఒకపదార్థ మున్నది, ఒకవస్తువున్నది" అని యనుచున్నాము. ఈ చెట్టు ఎట్లుత్పన్నమైనది? అని ప్రశ్నించు నపుడది విత్తు నుండి పెరుగుచున్నది, లేక పరిణామము నొందుచున్నది అని చెప్పుచున్నాము. కాని పెరుగుట, పరిణామము నొందుట అనునది ఒక విధానముయొక్క క్రమఫలితము ను వెల్లడించునుగాని, పైప్రశ్నకు సమాధానముకాదు. అది ఆ విధానమునకు కారణమునుగాని, విధానమును గాని విశదపఱచుటలేదు. విత్తనమునుండి చెట్టే ఏల కలుగవలయును? మరేదైన ఏల పుట్టకూడదు? అది

దాని స్వభావమని సమాధానము చెప్పను. కాని అదియే దాని స్వభావమేల కావలెను? దానినుండి ఇంకొక చెట్టు పుట్టకూడదా లేక మఱియొక రూపము రాకూడదా? అది దానిధర్మము అని సమాధానము చెప్పను. అదియే దానిధర్మమేల కావలెను? ఇక్కడ అది అట్లున్నదిగనుక అట్లేయుండును అని చెప్పవలెను. అట్లేలజరుగవలెనో ఎవ్వడును చెప్పజాలడు. దానిధర్మమది, దానిస్వభావమది అని మనము చెప్పుటలో మన మొక భావసత్యమునుగూర్చి సూచించుచున్నాము. మన మేవస్తువుమీదగాని, శక్తిమీదగాని మరి దేనిమీదగాని చేయివైచి "ఇదిగో దీనిధర్మమిది దీనిస్వభావమిది" అని చెప్పజాలము. విత్తనములో చెట్టుయొక్క భావ మంత ర్హితమైయున్నది. గనుక దానినుండి చెట్టు పరిణమించు చున్నది. అది రూపములో ఆవిర్భవించుకొనినవిధానమే గాని, నూతనసృష్టి కాదు. నిరంతరాయమగు భావమే లేనిచో నియమబద్ధమైన ప్రపంచమేయుండదు. అంతయు యథాయథగా, తథాతథగా, సంభవించుచు నల్లకల్లోల ముగా నరాచకముగానుండును. ఒకభావమును రూప ములో ప్రకటించు, సృష్టించు, శాశించు ప్రజ్ఞయే లేని చో, వస్తువులయొక్క ప్రకృతి యిది అను భావమే యుండదు. రూపము మారును, పుట్టును, నశించును, కాని దానివెనుకగల భావముమాత్రము సనాతనము. ఆవిర్భవించుకొన్నది, దృశ్యమానమైనది రూపము. భావము, తత్త్వము, సనాతనము. రూపము మారును.

భావము సత్యము. కనుక హిందూవిచక్షణుడు ప్రతి దానిలోను అంతర్హిత ఆత్మశక్తినే చూచును. దానినే "ప్రజ్ఞగా" విశ్వచేతనముగా, అచేతనములోని చేతనముగా, నిష్క్రియత్వములోని సక్రియత్వముగా మనము చూచుచున్నాము. ప్రజ్ఞయొక్క శక్తినే పాశ్చాత్యులు ప్రకృతి యందురు. చెట్టు దానంతటదే రూపమును దాల్చుటలేదు. అదట్లు చేయజాలదు. దానిలోనున్న అంతర్హితప్రజ్ఞాశక్తియే దానికా రూపము నిచ్చుచున్నది. ఆశక్తియే మానవుని వీర్యములోనుండి ఆచిన్న బిందువుతోనే, అలవాటులను, వర్తనమును, వివిధభావములను జనింపనున్న శిశువులోనికి గొంపోవుచున్నది. కనుక పితృగుణానువృత్తి సత్యము. కాని బీజములో, 'ప్రజ్ఞ' అంతర్హితముగా నుండనిచో పితృగుణానువృత్తి అసత్యము, అసంభవము, అసమర్థనీయము. ఈశక్తియే మానవ హృదయములోను మనస్సులోను, శరీరములోను, కూడ కలదు. అంతర్హితశక్తి శరీరముమీద అధికారమును గలిగియుండుటచేతనే, తన ముద్దరను శరీరముమీద వేసియుండుటచేతనే, శరీరములో తన్నుదా ప్రకటించుకొనుటచేతనే శరీరము మనిషియొక్క వ్యక్తిత్వమును ప్రకటించుచున్నది. కనుకనే ఏ రెండుముఖములుగాని, ఏ రెండురూపములుగాని, చివరకే రెండు వేలుముద్దరలుగాని ఒక్కమాదిరిగా నుండుటలేదు. శరీరములో ప్రతి భాగముకూడ నేదోయొకవిధముగా దాని వ్యక్తిత్వమునే వెల్లడిచేయుచున్నది. మనస్సులోను, హృదయము

లోనుకూడ అంతర్నిహిత ఆత్మశక్తియే ప్రకటనమగుచున్నది. కనుక మనుష్యులు, కుటుంబములు, జాతులుకూడ ప్రత్యేకవ్యక్తిత్వమును కలిగి ఒక్కొక్క అలవాటును, భావమును, ఊహాపోహాను కలిగియున్నారు. కనుకనే మానవులు ఒకేమాదిరిగను వివిధములుగను కూడ నున్నారు. ఒకేఆత్మ అన్నిభూతములలోను యుండి తనను తాను ప్రకటించుకొనుట కనువగు వివిధభావములను, రూపములను దాల్చుటచేతనే మానవులలో శారీరకముగాను, నైతికముగాను, ఆధ్యాత్మికముగాను అన్యోన్యములు, ప్రతీకారములు జరుగుచున్నవి. ఈఅంతర్నిహితాత్మశక్తియే కార్యములలోను, ప్రపంచాద్భుతగతిలోను వ్యక్తమగుచున్నది. ఇతడే కాలపురుషుడు; సూర్యుల మార్పులలోను, అనేక శతాబ్ద విధానములలోను నున్నదీ ఉద్దేశ్యమే. ఇదియే మూలపరిణామమును సంభవముచేసి దానికొక మార్గమును, సాధనమును, పరమావధిని యేర్పఱచుచున్నది. "అన్ని వస్తువులను అనాదినుండి పరిపూర్ణముగా శాసించునదీఈశుడే"

ఉపనిషత్తులలో నత్యంత ప్రాచీనరూపములో నున్న వేదాంతము దీనినే బోధించుచున్నది. ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు ఏకము (భగవంతుడు) నకును అనేకమునకును గలసంబంధమును చూచువివిధ మార్గములుమాత్రమే. ఇందేయొకటియు వేదాంత శబ్దమును తమవశము చేసికొనజాలవు. అనేకములు ఏకము యొక్క ఆవిర్భావములుమాత్రమే; కనుక అద్వై

తము సత్యము. భావసత్యములును సనాతనములే; అవి ఒకసారి ఆవిర్భావ మగుచో నవి యిదివరకును ఆవిర్భవింప బడియుండవలెను. ముందును ఆవిర్భవింపబడును. కనుక విశిష్టాద్వయితముకూడ సత్యము; అనేకములు ఏకములో సనాతనముగనే యున్నవి; అవి ఒకప్పుడు ఆవిర్భవ మగును; ఒకప్పుడుకావు. ఒకదృష్టిలో ఏకమును, అనేకములును, సారభూతమున సనాతనముగా, ఒకటేయైనను, మఱియొకదృష్టిలో భావసత్యముయొక్క రూప మెప్పుడును, నది ప్రకటితమగు చైతన్యమునుండి భిన్నమగుచున్నది; కనుక ద్వయితము సత్యము. ఏకత్వము, సనాతనము, మార్పులేనిదియైనట్లే ద్వయితము కూడ నిరంతరాయముగానే సంభవమగుచున్నది. ఆత్మయనంతము; సనాతనము; అపరిమితము. అట్లే అది ఆవిర్భవించుకొనుటకును అనంత, సనాతన, అపరిమిత శక్తినిగలిగి, అనంత ప్రదేశము ననంతకోటి జీవులతో (స్థితులతో) నింపుచుండును.



# వ్యక్తియు తత్కృష్టత

ప్రతి యుద్యమములోను, మానవకోటియొక్క ప్రతి సమష్టికార్యములోను, కాలధర్ముడు, కాలపురుషుడు వ్యక్తమగుచుండును. ఈపేరులలోనే గంభీరభావము కలదు. జగదుద్ధారమునకు వినాశనమునకు హేతువగు జగదీశ్వరియే, జగన్మాతయే మానవహృదయాంతరాళమున రహస్యముగా పనిచేయుచుండు మహాశక్తి. ఈశక్తి మానవప్రవాహములోను, మానవసంస్థలలోను, యుద్యమములలోను, ప్రపంచాభివృద్ధిని ప్రపంచజాతుల పరమావధిని స్థిరపరచు తన యాంతరంగిక తత్త్వమగు మహాకాలములోను, వ్యక్తమగును. ఈకాలపురుషుడే సూత్రధారుడు, సంధానకర్త, చోదకుడునై కాలములోనే తనపనిని నెరవేర్చుకొనును. అంతరంగమునుండి యొకసారి కదలికయు శక్తియు బయలుదేరినతోడనే, కాలపురుషుడును, జగదీశ్వరియు దానిని శిరసావహించి, తయారుచేసి, పక్వపరచి, ఫలోన్ముఖమునకు తెచ్చి కృతకృత్యతను గావింతురు. కాలధర్మము, కాలములోని భగవంతుడు ఒక నిశ్చయమార్గమును బట్టినపుడు ప్రపంచశక్తి

లన్నియుకూడ తమతమ సుస్థిరప్రవాహముల నామార్గ మునకే, విధినిశ్చితార్థమునకే, మరలింప నిర్దేశింపబడు ను. వీనిని గ్రహించి యీపనికి తోడ్పడువాడీ ప్రవాహ మును బుద్ధిపూర్వకముగా నభివృద్ధిచేయుచున్నాడు. దీని కభ్యంతరమును కలిగించునదికూడ దీనికి మఱింత బల మునే చేకూర్చును. ఇది ప్రవాతప్రకంపిత సముద్ర తరంగమువలె నొకప్పుడు మిన్నంటునట్లు లేచుచు, ఒకప్పు డధఃపతనమగుచు, ఒకప్పుడు జయజయధ్వానములతో జయభేరినిమ్రోగించి యుబికిపోవుచు, ఒకప్పుడు పరాభవ మునకు పాల్పడి దైన్యముకొంది యధైర్యముచే తగ్గిపో వుచును రహస్యముగా పనిచేయుచున్న ఈశక్తి, విధికృత ఫలప్రాప్తికొఱకు పురోమార్గమునేబట్టి పోవుచుండును. మానవులు దీని కడ్డముతగులుదురుగాక! సహాయము చేతురుగాక! కాలప్రవాహము మాత్రము నిరంతరాయ ముగా కృషిచేయుచు, నిర్మించుకొనుచు, ప్రతిష్ఠించు కొనుచు, విఘ్నముల నన్నిటిని త్రోసివేయుచు జయించు చుండును.

శ్రీకృష్ణభగవానుడు తన విశ్వరూపమును ప్రదర్శించి లోకక్షయముకొరకుద్భవిల్లిన కాలుడను నేనేయని చాటిననాటి మహాద్భుత కురుక్షేత్ర ప్రదర్శన మీగంభీరమానవాభిప్రాయమునే వ్యక్తపఱచుచున్నది. "మనము మహాపాపమును చేయుచున్నారము. స్నేహి తులను, సోదరులను, అశేషజనమును ధ్వంసముచేయు మహాద్రోహులము. నే నీపనిని చేయజాలను" అని

యర్జునుడు దుస్త్రసన్యాసమును గావించినపుడు శ్రీకృష్ణు డతని బుద్ధిమాంద్యమును తొలగించి గీతలో 11-వ అధ్యాయములోని వస్తునిజతత్త్వము నతనికిట్లు బోధించెను.

కాలోఽస్మి లోకక్షయకృత్ ప్రవృద్ధో లోకాన్
సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతే అపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

తస్మాత్త్వము త్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

"నేనీ సర్వమానవలోకమును సంహరించుట కుద్భవించిన మహాకాలుడను. నాకార్యమమోఘము. నేనీజాతులను సంహరించుటకే వచ్చితిని. నీవు లేకపోయినను యుద్ధసన్నద్ధులైవచ్చిన ఉభయపక్షయోధులును నశించుట నిశ్చయము. కనుక లెమ్ము! శత్రువులను జయించి యశమును సంపాదించుము. సమృద్ధరాజ్య భోగము ననుభవింపుము. ఈ యోధులందరును యిదివరకే నాచే చంపబడిరి. ఓ సవ్యసాచీ! నీవు నిమిత్త మాత్రుడవు కమ్ము! లెమ్ము!"

ఇక్కడ శ్రీకృష్ణుడు ప్రదర్శించిన యాత్మ ప్రదర్శనము కాలముయొక్క మందగమన విధానము

గాదు, అనేకదశలనుండి జాగ్రత్తగా తయారు యగు చున్నకాలమునే నాడు శ్రీకృష్ణుడొక్కత్రుటిలో ఫల ప్రదమగు కాలరూపమున యర్జునునకు చూపించెను. ప్రతివాడును కురుక్షేత్రరంగమునకు అవశముగా పోవు చుండెను. కాని అట్లు వారెఱుగరైరి! ఈ మహానాశ మున కడ్డుతగులుటకు సర్వప్రయత్నములను చేసినవారు కూడ తమ యుదాసీనతచేతగాని, కార్యములచేతగాని దానినే దోహదముచేసిరి. దాని వేగమునకే తోడ్పడిరి. భవిష్యద్వినాశనదృష్టిని కలిగినవారుకూడ విధివిధానము నాపజూచి విఫలురైరి. ఫలము నాశించక పనిచేయు నిష్కామ కర్మయోగియైన శ్రీకృష్ణుడుకూడ నిరర్థక హస్తినాపుర రాయభారమును గొంపోలేదే! కాని కాలము అప్రతిహత మయ్యెను. సముద్రముకొరకు త్వరపడు నదులవలె, దీపము నాలింగనము చేయుటకు రెక్కలను విదల్చు పురుగులవలె, అస్త్ర శస్త్ర సైన్యో పసైన్యములతోడను, రథ, గజాశ్వతురంగ బలముల తోడను, నానావిధ వ్యూహములతోడను, బ్రహ్మాండ భాండమును బ్రద్దలుచేయు శంఖారావములతోడను, ఉద్ధత భారతరాజలోకమంతయు హాహాకారములతో నోరు తెఱచుకొని వచ్చుచున్న కాలానల ప్రవేశము నొంది, భయానకదంష్ట్రికరాళములందు భగ్నశిరస్కు లును, ఖండిత శరీరులును నైరి. ఈశ్వర లీలలో బీభత్స భయానకములును, మాధుర్య సౌందర్యములునుకూడ ప్రదర్శింపబడును. కురుక్షేత్ర నటరాజనర్తనము లేకుండ

బృందావనకేళీ పూర్తికాజాలదు. సంఘర్షణ నుండి సామరస్యమునకును, ద్వేషమునుండి ప్రేమకును, పోరు నుండి సౌభ్రాతృత్వమునకును, చెడుగునుండి పరిణామమును పూర్తిచేయుటకు బాధా పాపము మొదలగు వాటిని శివ శాంత శుద్ధానందములుగా మార్చుటకును, జరుగు ప్రపంచోత్కృష్ట సామరస్య విధానములో నీ రెండునుకూడ భాగములే యగుచున్నవి.

కాలప్రవాహమున కెవరడ్డుపెట్టగలరు? అత్యుత్కృష్టదశలోనున్న యొక యమోఘబుద్ధి బలప్రాధాన్యమైన నాగరితయొక్క యనూనప్రసూనములైన యోధులు, బలాఢ్యులు, వేదాంతులు, యోగులు రాజకీయవేత్తలు, ప్రజానాయకులు మొదలగువా రెంతమంది భారతదేశమునప్పుడు యుండలేదు! ఇందులో నేకొద్ది మందియో ఒకపక్షమునుండి మఱియొక పక్షమునకు మాఱియున్నచో, నీమహా విపత్తంతయు జరుగకుండు నట్లు కాన్పించునే! అట్లనియే అర్జునుడు తన గాండీవమును పారవేసెను. అతడు పాండవులలో మకుటము. అతడులేకుండ వారు జయించుట వట్టికల్ల; అతడు లేకుండ యుద్ధముచేయుట పిచ్చిపని. కాని అట్టివానికే కాలపురుషుడు విధికృతము తప్పదనియు, ఎంతటి యమోఘబలసంపన్నుడైనను దాని కెదురీదుచో నిర్వీర్యుడగుననియు బోధించెను. నీవు లేకపోయినను యుద్ధమునకు సన్నద్ధమైవచ్చిన యీయుభయ పక్షములవారును నశించకమానరు! వీరు శరీరమాత్రముచేతనే యింకను

జీవించియున్నారు; దాని వెనుకనుండి కృతకృత్యతను బొందుతత్త్వముద్వారా వారిదివరకే నాశనము జెందిరి. దైవరక్షణగలవారి నెవరు చంపగలరు? దైవోపహతు లైనవారిని రక్షింప నెవరితరము? చంపువాడు నిమిత్తమాత్రుడే యగుచున్నాడు; అతడు తెరచాటున జరిగిన పనిని బహిరంగమునచేయు సాధనమాత్రమే యగును. కురుక్షేత్రరంగమున జరిగిన ఘోరహత్యలలోని సత్యమే యీ ప్రపంచమున జరుగు ప్రతివిషయము వెనుకను, సృష్టి,స్థితి,లయరూపమైన లీలవెనుకను, యున్నసత్యము.

ఈ ప్రబోధలోని యుత్కృష్టత, యుత్కృష్ట పురుషులకుమాత్రమే చెల్లును. అమోఘ పరివర్తనములను సాధించుటకు విధిచే నియంత్రితులైనవారిలో నీ మహాకాలశక్తి మూర్తీభవించును; వారిలో కాళీశక్తి ప్రవేశించును. ఒకనిలో కాళీశక్తి ప్రవేశించిన తరువాత నది హేతువులకుగాని, సంభవాసంభములకుగాని లక్ష్యపెట్టదు. అది ప్రకృతిశక్తి. బాలుడు కేళీవిలాసముగా కందుకము నెంత తేలికగా పైకెగురగొట్టునో యట్లే యీశక్తి నక్షత్రమండలినంతను వాటిస్థానములో నుండునట్లు విసరివేయగలదు. ఈశక్తి కసంభవము లేదు. ఇది ఘటనాఘటన కౌశలముగలశక్తి. ఇది స్వకీయ గుణములచేత నిగూఢమైన దేవాత్మశక్తి. దాని ప్రయోజనముల నది నెరవేర్చుకొనుటకు కాలముదప్ప మరేమియు దాని కవసరములేదు. అది కాలములో కదలుచు తన కదలికచేతనే దాని సాధనములను సృష్టించుకొని, సాధ్య

ములనెరవేర్చుచు కృతకృత్యులగుదురు. అది ఏ యనా మకునికో యదృష్టవశమున చిక్కినదిగాక యర్హుడైన వానిని తానే నిశ్చయించుకొనును. ఇట్లు నిశ్చయించి కార్యసాఫల్యమగువఱకును వానిని విడువనేరదు; తనను విడువనీయదు. కనుకనే శ్రీకృష్ణుడర్జునకిట్లుచెప్పెను.

యదహంకార మాశ్రిత్యన యోత్స్య ఇతిమన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥

'అహంకారముచేత నీవు "నేను యుద్ధముచేయ ను"అని దంభోక్తులాడినను నీ వచనములు మిథ్యావచ నము లగును. ప్రకృతి నిన్ను నీపనికి కట్టివేయును; నిరోధించును,' ఒకడు తనపనిని మానివేసినచో ప్రకృతి తనపని నతనిచే చేయించుకొని యతడు చేయవలసినపని నెరవేరినతరువాత మఱియొకనిని వెదకికొనినదని గ్రహిం చవలెను. ఉత్కృష్టకార్యమును నెరవేర్చినవాడు నాశ నము గావింపబడినచో నదియతడు తనలోనుండి పని జేసినశక్తిని యహంకారభావముచే తిరస్కరించుటచే నా శక్తియే వానిని, నెపోలియనును నాశనము గావించినట్లు, నాశనము చేయును, ముక్కముక్కలు చేయును అని గ్రహించవలెను. కొన్ని పరికరములు మూలధనముగా నుంచుకొనబడును. కొన్ని తోసివేయబడి ధ్వంసము చేయబడును. కాని మొత్తముమీద నన్నియును పరికర ములే యగును. మహాపురుషులలోని మహత్త్వయిదియే! తమశక్తిచేతనే వారు ఘనకార్యములను ఘటింపచేయుట

లేదు. వారిని నియోగించినశక్తికి వారు ప్రయోజనకారు
ాగుటచేతను, ఆ శక్తిచే వారు ప్రత్యేకముగా దానికొఱ
కే కల్పింపబడుటచేతను వారాపనిని సాధించగలుగు
చున్నారు. ఫ్రాన్సు పరివర్తనమును తెచ్చిపెట్టినవారిలో
మిరేబూ' వలె మరెవరును పనిచేయలేదు. తరువాత
ాతడట్లుచేయక ఏకప్రభుపాలన కుట్రలోజేరి వారికి
ోహదమునిచ్చి, ఫ్రాన్సువిప్లవమును ప్రతిఘటించి నవు
దది మహోత్కృష్టఫ్రాన్సు పీరుని కొఱకాగిపోయినదా?
ాలీదేవి తనపాదమును వానిశిరమున మోపెను. దానితో
ాతడంతరించెను. కాని విప్లవముమాత్ర మాగలేదు.
ఇది యథాప్రకారము సాగెను.

అది కాలధర్మము; ఈశ్వరేచ్ఛ. అది యెప్పు
డను నట్లేజరుగును. ప్రారంభదశలో తాముకొంత పాటు
ఃడినంతమాత్రముచే మేము ఘనకార్యములను సాధిం
చితిమను గర్వమున విఱ్ఱవీగు గర్వమతులందరును కాల
ప్రవాహముయొక్క సుడిగుండములలో మునిగిపోవుదు
ు. భ్రష్టయశోవంతులైన యిట్టివారి స్థానము నితరు
ాలంకరింతురు. విధిని తిరస్కరించక తమకు తామే
ాలముచే ముందుకుగొంపోబడువారు మాత్రమే సజీవు
ాగుదురు. వ్యక్తులయొక్క యుత్కృష్టత అంతరంగమున
ున్న సనాతనవిశ్వశక్తియొక్క యుత్కృష్టత మాత్రమే
ని గ్రహింతురుగాక.



# చింతనయు - దాని ధర్మములు

చింతనాశక్తి విశ్వమును నిర్మించును; ఏలయన చింతకుమూలమగు మనస్సుకూడ సత్యవస్తువే. దృష్టి గోచరమగు సమస్తము దానికొక స్వప్నము. సచేతనముగా, చింతనను ధారణచేయవచ్చును. ఇది జరిగినపుడు, దానికి విరుద్ధముగా నుండినదంతయు, లేక అట్లు కనుబడినదంతయు క్రమేణ అదృశ్యమై, అదేల అట్లు విరుద్ధముగ నుండెనని, లేక మనమేల దాని భ్రాంతియం దుంటిమని, ఆశ్చర్యపడుదుము.

చింతనాశక్తిచే, చేయబడజాలని దేదియు లేదు. మృత్యువ్యాధి దారిద్ర్యావమానములను, దీనిచే జయించ నగును. "నేను బలవంతుడను! నేను బలవంతుడను!!" అను చింతనను మనఃపూర్వకముగ, శాంతముగ, శ్రద్ధోపేతముగ, అచంచలముగ ధారణచేసి, మౌనముగ కూర్చొన్నను, అది పనిచేయును. ఒక బలవత్తరమైన చింతనయెదుట, దాని విరుద్ధభావము లన్నియు, ఆత్మ సంరక్షణ గావించుకొన నన్వేషించుచు, క్షమాపణను కోరుచు, అవేల సమాధానపడుట కిష్టపడలేదో తెలుప

వేచియుండును. వానిని తమ విరోధకారణ మగుగకమును ప్రేతమసంగతిని తామే వెలిబుచ్చుకొని, అంతర్ధానమగును.

ప్రజ లొక్కటిగా చేరి, ఒక్కచింతన నందఱు నొక్కసారిగా చింతించిరేని, శరంగుల శ్రేణికన్న నది బలవత్తర మైయుండును. భారతప్రజ లందఱు ప్రతి సాయంసమయమున పది నిమిషములకాలము "మేమంద ఱము ఒక్కటి; మే మందఱము ఒక్కటి: ఏదియు మాలోమాకు విభేదములను కల్పించజాలదు; ఏలయన మే మందఱము నొక్కటే; మాలోమాకుగల విరోధము లన్నియు భ్రాంతిజనకములు: మేమందఱమును ఒక్కటి." అని చింతించిరేని, యిందుచే నుత్పన్నమగు శక్తిప్రమాణ ము నూహించుట కష్టము.

ఈశక్తిని నిర్మాణకార్యములందే వినియోగించ వలెను. విస్పష్టమగు ఉన్నతోద్దేశ్యములకే, మనము దీనిని ఆచరింపచేయవలెను. ఏదేని సునిశ్చయ నిర్మాణ కార్యమునకు శ్రద్ధతో ప్రేమతో, ఈశక్తిని ప్రయో గించవలెనేకాని, ద్వేషమునకు, అసూయతకు, కోపము నకు కూడదు. దౌష్ట్యమును నిర్మూలించవలసినప్పుడును, అనృతమును జయించవలసినప్పుడును, మనము వ్యక్త పఱచవలసిన సత్యమును, ఆచరించవలసిన మంచికార్య మును, ఈ వీనిని గుఱించియే చింతించవలెనుకాని, అనృతమును ద్వేషమును గుఱించికాదు.

నిర్మూలన కార్యములకు మానసికశక్తులను ప్రయోగించుట దోషభూయిష్ఠమని సర్వదా తలంప

బడుచున్నది. దీనిని పాశ్చాత్యులు పిశాచవిద్య యని చెప్పెదరు; దీనిని ప్రయోగించువారిపై అది భయంకర విధముల ప్రతీకారమొనర్చును. తన చింతనాశక్తిని తెలిసికొన్నమానవుడు మహోపకారశీలుఁడై యుండవలెను. అతఁడొకసారి రెండు విరుద్ధవిషయములను యత్నించకూడదు. కాని, తాను సాధించవలసిన విషయములలో ఆశ్చర్యకరమును, ఉచితమును నగు విషయమును గ్రహించి, దానినే స్వీకరించవలెను; దానిపైననే ఏకాగ్రత వహించవలెను. అప్పుడీచింతన, కార్యరూపమును దాల్చబోవునప్పుడు, దాని నెదుర్కొను విషయములన్నియు పలాయనమగుట, అతడు చూచును. విషయముల నొకదానికొకటి విరుద్ధమగువానిని చింతించి సంక్షోభమొందుట సాధారణమానవుని విధానము. కాని, ఈ నూతనవిధానము కర్మక్షేత్రమును సహేతుకమొనర్చి విశుద్ధముకావించి, శాస్త్రయుక్తముగా మన కోరికపై నాధిపత్యమువహించి, వానిని ప్రపంచమునందు సిద్ధింపచేయును.

మన మాకాంక్షించు విషయము లెంత స్వార్థరహితమో, అవి అంత సూక్ష్మతరముగను బలవత్తరముగను చింతనాశక్తి సంచయమై పనిచేయును. "భారత మహాప్రజలారా! మేల్కొనుడు, మేల్కొనుడు!!" అని నూర్లకొలది, వేలకొలది ప్రజ లొక్కసమయమున తమ యాంతరమున ఉచ్చరించుటచే, అది వారి భావోత్తేజము ననుసరించి కొలువరానంతశక్తిని కలిగించును.

మన చింతన విశుద్ధమై, నియమబద్ధమై యుండవలెను అప్పుడది సృష్ట్యాత్మకమగుట మన మాశ్చర్యముతో చూతుము; మన ఆంతరికప్రపంచమునం దుండునదే బాహ్యప్రపంచమున ప్రతిబింబించుటకు ప్రారంభించును స్త్రీపురుషు లందఱు నప్పుడు, అవతరించిన భావమూర్తులుగ మనకు గోచరింతురు.

ఉదాహరణముగ, విద్యావిషయమును గుఱించి వివరింతము. ఇప్పటిలో, దాని విషయమున మన మేమియు చేయలేమని మనకు తోచుచున్నది. జావాదేశములోని ప్రజలనువలె, మనలనుకూడ కూలీలగను, చిన్న చిన్న వ్యవసాయదారులుగను ప్రస్తుత పరదేశ విద్యావిధానము మార్చివేయకుండ, దాని వేగమును అరికట్టవలెను. కాని, యిట్లుచేయుటకు మనము మనపైననే తప్ప నితరులపైన ఆధారపడుటకు మనకేమి అధికారమున్నది? మనల నీజ్ఞానమునుండి అపహరించుటకుగా మన మానసికశక్తిని గుఱించికాక మరి దేనినిగుఱించి, పరదేశీయులు భయపడగలరు? మనపూర్వులనుండి మనకు సంక్రమించిన ఈ మానసికశక్తిని మనము గ్రహించి, వశమునకు తెచ్చుకొనుటలో, మనము కావించివలసిన నిర్మాణముకొఱకు, పడవలసిన కష్టములకొఱకు త్యాగము చేయవలసిన వారెవ్వరు? మనమే, మనమే; సదా మనమే. ఏలయన, మణి మాణిక్యములకన్న జ్ఞానము అధిక విలువగలదియని మనకు తెలిసి, ఆసత్యమును మనము ప్రదర్శించగలుగుదుము. ఎంతటి త్యాగమైనను

నొనర్చి దానిని మనము సాధింతుము. అందుకు మన ప్రాణముల నైన నర్పింతము. ఎన్ని కష్టముల కైన నోర్చుకొని మనము జ్ఞానము నార్జించవలెను. మన మందరమును విద్యావంతులము కావలెను. ప్రపంచమునందన్నిజాతులకు మన సంస్కృతిని వ్యాప్తి కావించవలెను. వాఙ్మయము సారస్వతము, మనశ్శాస్త్రము, గణిత శాస్త్రములనుపట్టి, ప్రపంచసంస్కృతి నిర్ణయింపబడిన కాలమునందు, మనము అగ్రేసరుల మైయుంటిమి. భౌతిక విజ్ఞానశాస్త్రము, సాంకేతికవిద్య ప్రస్తుతము ప్రపంచ సంస్కృతిని పాలించుచున్నవి. వీనియందుకూడ మన మగ్రేసరులము కావలెను. భారతీయుని మేధ ప్రపంచము నందెవరికిని తగ్గదని చరిత్రచాటుచున్నది. అందుచే మన మిప్పుడు మఱల అగ్రస్థానమును వహించవలయును; ప్రపంచము బౌద్ధికముగా వికాసముపొందు కార్య భారమును మనము మనఃపూర్తిగా మోసికొనవలెను. ఈ కార్యము మన కసాధ్యమగుటకు, మనయం దంతర్గత దౌర్బల్య మేమైనకలదా? భాస్కరాచార్యులు, శంకరాచార్యులు జన్మించిన భారతదేశము న్యూటన్ డార్విన్ల జన్మదేశమునకన్న తీసిపోవునా? అట్లెప్పటికిని కాదని, నా నమ్మకము. మనల నెదుర్కొను ప్రతిబంధకములను పోద్రోసి, ఆయినుపగోడలను పగులగొట్టి ప్రపంచమునందు బౌద్ధికసామ్రాజ్యమును స్థాపించి, భోగించుటకు చింతనాశక్తిని విజృంభింపచేయుట మన కర్తవ్యము.



# దేశారాధకుని ప్రతిదిన ప్రార్థన

భారతజాతి అభేద్యము, అవిభాజ్యము, ఏకము అని నా విశ్వాసము

ఒకేదేశము, ఒకేసహానుభావము అను ప్రేమపై మన జాతీయ ఐక్యత నిర్మింపబడినది.

ఏ ఆధ్యాత్మికశక్తి, వేదములందును ఉపనిషత్తులందును వచింపబడెనో, మతములను సామ్రాజ్యములను నిర్మించెనో, విద్యావంతుల జ్ఞానమును సముపార్జించెనో, సాధుపుంగవుల నిదిధ్యాసగ పరిణమించెనో, అది మజల మనయం దుద్భవమైనది: దానిపేరు జాతీయత.

వర్తమాన భారతదేశముయొక్క వేళ్లు దాని గతమునందు లోతుగా పాదుకొని యున్నవనియు, దాని యెదుట మహోన్నతమైన భవిష్యత్తు ప్రకాశించుచున్నదనియు నా విశ్వాసము.

ఓ జాతీయతా! కుశలముగనో, లేక అకుశలముగనో, మానముగనో, లేక అవమానముగనో, ఎట్లైనను సరే, నీవు నాయందు జనించుము—నన్ను నీ స్వకీయ వస్తువుగా చేకొనుము.

# మావద్ద దొరకు గ్రంథములు

| | | |
|---|---|---|
| | | రు. అ. పై |
| ౧. | పూర్ణయోగము-(శ్రీనలినీకాంతగుప్త) | ౧-౪-౦ |
| ౨. | ఇంపుకథలు-(శ్రీమాత) | ౧-౮-౦ |
| ౩. | ప్రార్థనలు ధ్యానములు-(శ్రీమాత) | ౧-౮-౦ |
| ౪. | కాళిదాసు-(శ్రీఅరవిందులు) | ౧-౦-౦ |
| ౫. | మెఱపులు తలపులు-(శ్రీఅరవిందులు) | ౦-౧౦-౦ |
| ౬. | సుభాషితములు-(శ్రీమాతారవిందులు) | ౦-౮-౦ |

## అచ్చులోనున్న గ్రంథములు

౧. గీతాభూమిక-(శ్రీఅరవిందులు) .........

౨. జగన్నాథుని రథము-(శ్రీఅరవిందులు).........

ఈ గ్రంథములు దొరకుస్థలము :

చీమలవాగుపల్లె నారాయణరెడ్డిగారు
శ్రీఅరవిందాశ్రమము
పుదుచ్చేరి.